# గ్రంథకర్త పరిచయం

ప్రఖ్యాత రచయిత, విమర్శకులు, వక్త, ఉపాధ్యాయులు అగు శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషలలో పండితులు. స్వయంకృషితో తెలుగు. ఇంగ్లీషు, హిందీ భాషలలో అనేక పట్టములు సంపాదించారు. 1943–48 సంవత్సరాలలో గాంధీ గారి నిర్మాణ కార్యక్రమములో చురుకుగా పాల్గొని ఖద్దరు, హిందీ భాషా ప్రచారము చేశారు. తరువాత కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరి 1977 లో ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. ఆ కాలములో వారు రచించిన గ్రంథాలలో శుభోదయములు, తుక్కాంబ, రఘునాథ విలాసము, 'పూర్వాంధ్ర కవులు' ఆంధ్ర, ఉస్మానియా, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. ఉద్యోగ విరమణ తరువాత వేద వాఙ్మయముపై అపారకృషి చేసి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పాతంజల యోగ సూత్రముల వంటి విషయములపై సరళమైన తెలుగు భాషలో అనేక గ్రంథములు రచించిన సోమయాజులుగారు స్వతంత్ర భావనాశక్తి గల పండితులు. 13–12–1922 తేదీన కృష్ణాజిల్లా తోట్లపల్లూరు గ్రామంలో జన్మించిన వీరు 2–2–1997 న తాడిగడప గ్రామంలో వారి స్వగృహమున దివంగతులైనారు.

# ప్రవేశిక

'ఉపనిషద్దర్శనము' మొదటి భాగంలో తైత్తిరీయ, ప్రవ్న, ఈశ, కేన, మాండూక్య, కఠోపనిషత్తులు; రెండవ భాగంలో బృహదారణ్య కోపనిషత్తు; మూడవ భాగంలో ఛాందోగ్య, ఐతరేయ, ముండకోపనిషత్తులు ముద్రింపబడ్డాయి. ఈ పది ఉపనిషత్తులకు జగద్గురువులు శ్రీ ఆదిశంకరులు భాష్యం వ్రాశారు. ఈ భాగంలో శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులను ముద్రించాము. దీనితో బహుళ ప్రచారంలో వున్న ద్వాదశోప నిషత్తుల ముద్రన పూర్తి అయింది. ఈ ద్వాదశోప నిషత్తులలో కొందరు శ్వేతాశ్వతర, నృషింహతాపిన్యుపనిషత్తులను, మరికొందరు నృసింహతాపినికి బదులుగా కైవల్యోపనిషత్తును గ్రహిస్తున్నారు. ఇందులో కైవల్యోప నిషత్తును చేర్చాము.

లబ్ధమైన ఉపనిషత్తులను ఈ దిగువ విధంగా విభజిస్తు న్నారు. దశోపనిషత్తులు పోగా మిగిలిన 98 ఉపనిషత్తులలో.

| | |
|---|---|
| యోగోపనిషత్తులు | 20 |
| సామాన్య వేదాంతోపనిషత్తులు | 24 |
| సన్యాసోపనిషత్తులు | 17 |
| శైవోపనిషత్తులు | 15 |
| వైష్ణవోపనిషత్తులు | 14 |
| దేవ్యుపనిషత్తులు | 8 |

ఈ శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులను శైవోపనిషత్తులలో చేర్చారు. నృసింహతాపినిని వైష్ణవోపనిషత్తులతో చేర్చారు. ఏమైనప్పటికి ఆదిశంకరులు భాష్యం వ్రాసిన దశోపనిత్తులు ప్రాచీనమైనవని, మిగిలిన ఉపనిషత్తులు ఆర్వాచీనమైనవని పండితుల అభిప్రాయం. పూర్తిగా నిర్గుణోపాసనను ఉపదేశించే ఉపనిషత్తులలో శైవ– వైష్ణవ భేదం చూడటం హాస్యా స్పదంగా ఉంటుంది. ఆయాశైవ వైష్ణవ మతాలు వ్యాప్తిచెందిన రోజుల్లో ఆయా సంప్రదాయాలకు చెందిన పండితులు చేసిన పని అయి ఉండాలి. కాబట్టి శివ విష్ణువులయొక్క సగుణనామం వచ్చినచోట నిర్గుణ పరబ్రహ్మనుగా స్వీకరించటమే మనవిధి.

శ్వేతాశ్వతరోపనిషత్తు, కైవల్యోపనిషత్తు కృష్ణయ జుర్వేదానికి సంబంధించినవని అంటారు. శాంతిపాఠాన్నిబట్టి, ముక్తికోప నిషత్తులో చెప్పబడిన విషయాన్నిబట్టి ఈ విషయం ధృవపడుతోంది. కొంతమంది కైవల్యోపనిషత్తు ఋగ్వేదానికి సంబంధించినదని అంటారు కాని తగిన ఉపపత్తులు లేవు.

'వాఙ్మేమనసి' అనే మంత్రంతో ఆరంభమైన శాంతిపాఠం కలవి ఋగ్వేదానికి సంబంధించినవి.

'అప్యాయన్తు సమేతులే' అనే శాంతిపాఠం కలవి సామ శాఖకు చెందినవి.

'సహనావవతు' అనే శాంతిపాఠం కలవి శుక్ల యజుశ్శాఖకు చెందినవి.

'పూర్ణమదఃపూర్ణ' మ్మనే శాంతిపాఠం కలవి శుక్ల యజుశ్శాఖకు చెందినవి.

'భద్రంకర్ణేభిః' అనే శాంతిపాఠం కలవి అథర్వశాఖకు సంబంధించినవిగా పండితులు వర్గీకరించారు.

ఈ శ్వేతాశ్వతర, కైవల్య, నృసింహతాపిన్యుపనిషత్తు లలోని మంత్రాలను కూడా ప్రామాణికాలుగా గ్రహిస్తూపూర్వులు, ఆర్వాచీనలు కూడా తమ రచనలలో వాటిలోని మంత్రాలను ఉదాహరిస్తూనే ఉన్నారు. ఈ ఉపనిషత్తులలో దశోపనిషత్తుల లోని కొన్నిమంత్రాలు, మంత్రభాగాలు కనిపిస్తున్నాయి. శ్వేతాశ్వతరోపనిషత్తులో రుద్రప్రశ్నలోని (నమకంలోని) కొన్ని మంత్రాలు యథాతథంగా ఉన్నాయి. కాబట్టి రుద్ర, ఈశానాది పదాలు ఉండటంవల్ల శైవోపనిషత్తులలో చేర్చి ఉంటారు. శ్వేతాశ్వతర మహర్షి తన శిష్యులకు దీనిని బోధించినట్లు చివరలో (6వ అధ్యాయం 21వ మంత్రంలో) కనిపిస్తుంది. దీనిలో సాధకునికి తపస్సుతో బాటు పరమేశ్వరానుగ్రహం కూడా ఉండాలని చెప్పారు. ఆ పరమేశ్వరానుగ్రహంకోసం భగవత్ప్రార్థన చెప్పారు. ఈ విధంగా భక్తికి కూడా కొంత అవకాశం లభించింది. ఇది దీనిలోని విశేషం.

కైవల్యోపనిషత్తులో మాండూక్యంలో చెప్పిన స్వప్న జాగ్రత్ సుషుప్తులను స్పృశించారు. 'చిన్మాత్రో హం సదాశివః' 'త్రద్భ హ్మాద్వయ మస్మ్యహం', 'సతత్త్వమేవ త్వమేవతత్' లాంటి ప్రామాణికాలైన మహావాక్యాలు కనిపిస్తున్నాయి. ఏమైనా, వీటిని కూడా ప్రామణికాలుగా గ్రహించేందుకు మనకు అభ్యంతరం ఉండనక్కరలేదని మా విశ్వాసం.

వినీతుడు

**– వ్యాఖ్యాత**

# విషయసూచిక

# శ్వేతాశ్వతరోపనిషత్తు

## శాంతిపాఠము

***ఓం. సహనా వవతు । సహనౌభువక్తు । సహవీర్యం కరవావహై।***

***తేజస్వినాన ధీతమస్తు। మానిద్విషావహై ॥***

***ఓం. శాంతి : శాంతి: శాంతి : ॥***

పరబ్రహ్మ గురుశిష్యులమైన మా ఉభయులను రక్షించు గాక ! మా ఉభయులను పోషించుగాక ! మే మిరువురము బ్రహ్మవిద్యా సంపాదనమున మిక్కిలి శక్తిగలవారమై ప్రయత్నింతుముగాక ! మా స్వాధ్యాయము బ్రహ్మజ్ఞానము వలన కలిగిన తేజస్సుతో తేజోవంతమగుగాక ! గురుశిష్యులమైన మాకు ఒకరిపై నొకరికి ద్వేషము కలుగకుండుగాక!

ఆధ్మాత్మిక, ఆధిభౌతిక, అధిదైవిక తాపములు శాంతిం చుగాక !

## మొదటి అధ్యాయం

***మం॥ హరిః ఓం ॥ బ్రహ్మవాదినో వదంతి, కిం కారణం బ్రహ్మకుతః***
***స్మ జాతాజీవామ కేన క్వ చ సంప్రతిష్ఠాః. అధిష్ఠితాః***
***కేన సుఖేతరేషు వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్. 1***

ఈ మంత్రంలో ఈ జగత్తుకు కారణం ఏమిటి? అనే విషయం చర్చింపబడుతోంది.

బ్రహ్మవేత్తలైనవారు తమలో తాము చర్చించుకుంటూ ఉంటారు– 'ఈ జగత్తుకు మూలకారణం ఏది? అది బ్రహ్మమా ? మనమంతా దేనినుండి పుట్టాము? మనం ఎవరివల్ల లేక దేనివల్ల జీవిస్తున్నాం? చివరకు మనమంతా దేనిలో కలసిపోతాం? ఓ బ్రహ్మవేత్తలారా!

మనం ఎవరి ప్రేరణవల్ల లేదా ఎవని నియామకాన్ని అనుసరించి సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాము? అంటే మనం అనుభవించే యీ సుఖదుఃఖాల సన్నింటిని వ్యవస్థీకరించే దెవరు? అని.

ఈ మంత్రంలో జగత్తుకు కారణాన్ని అన్వేషించటం కనిపిస్తోంది. ఈ జగత్తుకు మూలకారణం బ్రహ్మమా ? అనేది మొదటిప్రశ్న- బ్రహ్మము అంటే నామరూపాలకు, కార్యకారణాలకు అన్నిటికి అతీతమైనట్టి నిర్గుణ బ్రహ్మము. నామరూపాలకు, కార్యకారణాలకు అతీతమైనది ఈ జగత్తుకు, సృష్టికి కారణం కాగలదా? ఇది మొదటి ప్రశ్న.

మనం ఎవరివల్ల పుట్టాము? అనేది రెండవ ప్రశ్న. మొదటిది సమిష్టిని సూచిస్తే, ఇది వ్యష్టిని సూచిస్తుంది. అంతే ! మొదటి ప్రశ్నకు ఇది అనుప్రశ్న అనుకోవచ్చు. ఈ సృష్టి రహస్యం ఏమిటి? ఈ విశ్వం నిజంగా సృష్టింప బడ్డదా? అయితే, అట్లా సృష్టింపబడటానికి కారణం ఏమిటి? ఈ విశ్వం సృష్టింపబడక పోతే మనకు కార్యంగా ఎందుకు కనిపిస్తోంది? కార్యం కనిపిస్తోంది అంటే కారణం ఉండాలి గదా !

ఇక మూడవ ప్రశ్న- మనం ఎందుకు జీవిస్తున్నాము? ఈ విధంగా జీవించటాని కారణం ఏమిటి? ఈ జీవితానికి పరమార్థం ఏమిటి? ఈ జన్మకు కారణం ఏమిటి? దాని ఉద్దేశ్యం ఏమిటి? అని.

ఇట్లా జీవించిన సృష్టి లేదా మనం చివరకు ఏమవుతాం? మళ్ళీ పుడతామా? లేక పూర్తిగా నశించిపోతామా? లేక బ్రహ్మలో లీనమైపోతామా? ఇవన్నీ నాల్గవ ప్రశ్నలోని సందేహాలు.

ఈ విశ్వభ్రమణం ఒక నియమాన్ని అనుసరించి తిరుగుతున్నట్లు కనిపిస్తోంది. ఇదంతా ఏదో ఒక పద్ధతి ప్రకారం, ఒక వ్యవస్థకు లోబడి నడుస్తున్నట్లు తోస్తుంది. మనం స్వతంత్రులం కాము. స్వతంత్రులమైతే సుఖమేతప్ప మనకు దుఃఖం అనుభవించాల్సిన అగత్యం ఏమి ఉంటుంది? ఈ ప్రపంచంలో, ఈ జన్మలో మనం అనుభవిస్తూన్న ఈ దుఃఖాలను తొలగించుకోవటానికి మార్గాలున్నాయా? ఇవన్నీ ఈ చివరి ప్రశ్నలోని విషయాలు. మొత్తానికి మానవజన్మ ఎత్తిన, ఏ మాత్రం జిజ్ఞాస కలవాడికైనా ఎప్పుడో ఒకప్పుడు ఎదురయ్యే ప్రశ్నలు ఇవి.

***మం॥ కాలః స్వభావో నియతి ర్యదృచ్ఛా భూతాని యోనిః***

***పురుష ఇతి చిత్యా, సంయోగ ఏషాం న త్వాత్మభావా***

***దాత్మా ప్యనీశః సుఖదుఃఖ హేతోః.*** **2**

కాలం, ప్రకృతి మొదలైనవి ఈ జగత్తుకు కారణం కాజాలవు అని ఈ మంత్రం సూచిస్తోంది.

కాలము, స్వభావము (ప్రకృతి) నియమము, యదృచ్ఛ (అనుకోకుండా జరగటం, కాకతాళీయం అంటూంటాం), పంచభూతాలు (పదార్థాలు) ప్రకృతి పురుషులు, ఇవన్నీ వేరువేరుగా కాని, అన్నీ కలసికాని ఈ సృష్టికి కారణాలు కాజాలవు. ఎందుచేతనంటే, ఆ కాలము స్వభావం మొదలైనవే సృష్టింపబడ్డాయి కాబట్టి ! అటువంటివి సృష్టికి కారణా లెట్లా అవుతాయి? ఇవన్నీ కూడా తమ తమ ఆత్మకు ఆధీనంలో ఉన్నాయి. అట్లాగే జీవాత్మ కూడా ఈ సృష్టికి స్వతంత్ర కారణం కాదు. ఎందుచేతనంటే, ఆ జీవాత్మ కూడా సుఖదుః ఖాలకు, శుభాశుభాలకు వశీభూతమై ఉన్నది. అందుచేత జీవాత్మ కూడా జగత్కారణం కాజాలదు.

పైన జగత్కారణంగా ఊహించిన వాటిలో మొదటిది కాలం. పదార్థాలు రూపాంతరం చెందటానికి (మారటానికి) కాలం కారణమౌతోంది కాబట్టి కొందరు కాలమే ఈ జగత్తుకు కారణ మన్నారు. వారు కాలవాదులు. కాని వారివాదం తప్పు. ఎందుచేతనంటే కాలమనేది మన ఆలోచనలో, ఊహలో ఒకభాగం మాత్రమే ! కాలం కూడా భవిష్యత్తు వర్తమానంగా, వర్తమానం భూతంగా మారుతోంది. కాలంలో అనేక క్షణాలు పుడుతున్నాయి. నశిస్తున్నాయి (సృష్టిలో జరుగుతున్నట్లే). పైఆ అనుక్షణం మార్పుచెందుతున్న ఈ కాలాన్ని గుర్తిస్తున్న ఆత్మ అనేది కాలంకంటే ముందుగానే ఉన్నది. కాబట్టి కాలమనేది జగత్కారణం కాదని తేలుతోంది. అంతేకాదు. అగ్ని. ఉష్ణం మొదలైన వాటిమీద కాలంయొక్క ప్రభావం కనిపించదు.

కాబట్టి, స్వభావవాదులు (స్వభావము లేక ప్రకృతియే జగత్కారణం అనేవారు) ప్రకృతిని జగత్కారణ మన్నారు. కాని, ఒక వస్తువుయొక్క స్వభావము లేక ప్రకృతి అనేది ప్రారబ్దానికి అధీనమై ఉన్నది. కాబట్టి ప్రారబ్దమే ఈ జగత్తుకు కారమన్నారు కొందరు. వీరిని

నియతివాదులు అంటారు. విశ్వంలో ప్రకృతి కూడా ఒక భాగమే! అట్టి ప్రకృతిని జగత్తుకు కారణంగా చెప్పలేము. పైగా ఈ ప్రకృతిని గుర్తించటానికి కూడ ఆత్మ అనేది అవసరమౌతోంది. కాబట్టి ఈ విశ్వానికి కారణం దాని ప్రకృతి (సహజధర్మం) కానే కాదు.

ఈ సృష్టిలో ఒకవిధమైన పద్ధతి, క్రమము, సమన్వయం కనిపిస్తున్నాయి. ఒక నియమానికి కట్టుబడి ఉన్నట్లు తెలుస్తోంది. కాబట్టి నియతవాదులు నియమాన్ని జగత్కారణం అన్నారు. అయితే నియమ మనేది కూడా ఈ విశ్వానికి, దానిని గుర్తించే ఆత్మకు భిన్నంగా ఉండలేదు– విశ్వానికి, ఆత్మకు అతీతమైనది కాదు.

యదృచ్ఛావాదులు, నియతిని నిరాకరించి యదృచ్ఛను (అనుకోకుండా జరగటాన్ని, కాకతాళీయాన్ని) జగత్కారణం అంటారు. అయితే, ఇదికూడా సరికాదు. ఎందుచేతనంటే మానవుడు తన అజ్ఞానము, అల్పజ్ఞత్వము కారణంగా యదార్థాన్ని తెలుసుకోలేక, యదృశ్చను కల్పించుకుంటాడు. మనం అనుకున్న అనేక నిర్ధారితమైన విషయాల్లో లోపం కనిపించేటప్పటికి యదృచ్ఛను ఆశ్రయిస్తాడు. తన బుద్ధికి ఆలోచనాశక్తికి అతీతమైన సందర్భాల్లో యదృచ్ఛను కారణంగా అనుకుంటాడు. ఇక చార్వాకులు భూతాలనే (పంచభూతాలు లేదా పదార్థం) విశ్వకారణంగా చెపుతారు. అవిభాజ్యమైన పరమాణువుల కలయికయే ఈ విశ్వం అని భావించినా అవికూడా (పరమాణువులు) ఈ విశ్వంలోనివే కదా! అంటే విశ్వంలో అవికూడా ఒక భాగముకదా! వాటికంటె ముందు వాటిని గుర్తించే ఆత్మ ఉంది కదా ! కాబట్టి పదార్థాన్ని కూడా విశ్వకారణంగా చెప్పటానికి వీలులేదు. సాంఖ్యులు సత్త్వరజస్తమోగుణాల సామ్యావస్థను ప్రకృతి అని, ఆ ప్రకృతినుండి మహతత్త్వం,మహతత్త్వం నుండి అహంకారం, అహంకారం నుండి పంచతన్మాత్రలు, ఏకదాదశ ఇంద్రియాలు, పంచతన్మాత్రల నుండి పంచభూతాలు పుడుతున్నాయని అంటారు. అయితే, జడమైన ప్రకృతిలో స్వతంత్ర వ్యాపారాన్ని నిర్వర్తించే సామర్థ్యం ఉండదు ఏదో ఒక సత్తవల్ల జడమైన ప్రకృతిలో వ్యాపార సామర్థ్యం వస్తోంది. కాబట్టి, అటువంటి సత్త లేదా జీవాత్మయైన పురుషుడే జగత్కారణం అని మీ మాంసకులు అంటారు.

అయితే, ఈ పురుషుడు (జీవాత్మ) కూడా వెనుక చెప్పిన కాలం మొదలైనవి లేకుండా ఏమీ చేయలేదు. కాబట్టి వీటి అన్నింటి సమిష్టినే జగత్కారణం అనాలి. కాని, సమిష్టి లేక సంఘాతం అనేది ఇతరుల కోసం జరుగుతుంది. అంటే ఈ సంఘాతమనేది

శేషము అయితే ఆత్మ శేషి అవుతుంది. శేషము ఎప్పుడూ శేషికి లోబడి ఉంటుంది. స్వతంత్రం కాదు. కాబట్టి జీవాత్మను ఈ జగత్తుకు కారణం అనవచ్చు. కాని, ఆలోచించి చూస్తే శుభాశుభాలకు, సుఖదుఃఖాలకు వశీభూతుడైనందున (లోబడి ఉన్నందున) జీవాత్మకూడా విశ్వరచనలో స్వతంత్రుడు కాదు అని తేలుతుంది. అతడు స్వతంత్రుడే అయితే దుఃఖాన్ని, దుఃఖకారణాలను సృష్టించనే సృష్టించదు. పైగా జీవాత్మగా చెప్పుకునే ఈ అహంత సుషుప్తి నుండి జాగ్రత్ స్వప్నాలకు రాకపోకలు సాగిస్తూనే ఉన్నాడు. కాబట్ట ఈ జీవాత్మను కూడా నియమించే శక్తి వేరే ఏదో ఒకటి ఉన్నదని స్పష్టమవుతోంది.

***మం॥ తే ధ్యానయోగామగతా అపశ్యన్***
***దేవాత్మశక్తిం స్వ గుణై ర్నిగూఢాం ।***
***యః కారణాని నిఖిలాని తాని***
***కాలాత్మ యుక్తావ్యధితిష్ఠత్యేకః*** ***3***

ఈ మంత్రంలో ధ్యానయోగం ద్వారా జగత్కారణభూతమైన బ్రహ్మశక్తిని సాక్షాత్కరించుకోవటం చెప్పబడ్డది.

శ్వేతాశ్వతరాది మహర్షులు చిత్తైకాగ్రతను (ధ్యానయోగం) అనుసరించి, సత్త్వరజ స్తమస్సులనే గుణాలు, వాటికి కార్యాలైన కాలాదులచే ఆచ్ఛాదింపబడిన పరమాత్మ యొక్క శక్తిని దర్శించారు. ఆ పరమాత్మ ఎటువంటివాడు? పైన చెప్పిన కాలం మొదలుకొని జీవాత్మ వరకు గల కారణాలన్నింటికి ఆధారమైనవాడు– వీటి అన్నింటికి కారణమైనవాడు.

జగత్కారణాన్ని దర్శించడానికి మహర్షులు ఉపనిషత్తులలో చెప్పబడిన ధ్యానయోగాన్ని ఆశ్రయించారు. ఎందుచేతనంటే చిత్తైకాగ్రత లేక పోవటం వల్లనే కాలము మొదలుగాగల జగత్తు (కార్యం) వల్ల కారణమైనది (బ్రహ్మము) ఆచ్ఛాదింపబడి ఉన్నది. ధ్యానంవల్ల చిత్తైకాగ్రత లభించటంతోడనే ఆ ఆచ్ఛాదన తొలగిపోయింది కాబట్టి జగత్కారణమైనట్టి సత్తను నారు సాక్షాత్కరించుకొన్నారు. బుద్ధియొక్క శక్తి పరిమితమైనది. ఆ బుద్ధి తన పరిమితులను దాటి– ఏకాగ్రతతో, ధ్యానం ద్వారా– జగత్కారణమైన బ్రహ్మ యొక్క సాక్షాత్కారాన్ని పొందాలని భావం.

అయితే, ఈ పరబ్రహ్మను గూర్చి అనేకమంది అనేకరకాలుగా చెపుతున్నారు. మతాలు భగవంతుడని అంటున్నాయి. భౌతిక శాస్త్రవేత్తలు 'శక్తి' అంటున్నారు. వేదాంతశాస్త్రాలు పరమాత్మ అంటున్నాయి. ఎవరు ఏవిధంగా, ఎన్ని విధాలుగా చెప్పినా ఆ 'సత్త' అందరిలోను స్వయం ప్రకాశమానంగా ఉండనే ఉన్నది. ఆ 'సత్త' యే ఇచ్ఛాశక్తికి, జ్ఞానశక్తికి, క్రియాశక్తికి ఆధారం.కాలము, ప్రకృతి, నియమము, యదృచ్ఛ, పదార్థం, శక్తి, జీవుడు అన్నింటిని పర్యవేక్షించేది ఆ 'సత్త'యే ! బ్రహ్మమే !

***మం॥ త మేక నేమిం త్రివృతం షోడశాంతం***
***శతార్ధారం వింశతి ప్రత్యరాభిః***
***అష్టకైః షడ్భిర్విశ్వరూపైక పాశం***
***త్రిమార్గ భేదం ద్వినిమిత్తైక మోహమ్. 4***

ఈ మంత్రంలో జగత్కారణమైన బ్రహ్మను చక్రరూపంలో వర్ణిస్తున్నారు. ఈ చక్రాని& విశ్వచక్రంగా గ్రహించాలి.

ఆ మహర్షులు ఈ విశ్వాన్ని ఒక చక్రంలాగా భావించి ధ్యానించారు. ఈ విశ్వమనే చక్రానికి ఒక కొయ్యతో తయారైన చట్రం ఉన్నది. (అంటే చక్రం యొక్క పరిధిని ప్రకృతితో పోల్చారు. ఈ ప్రకృతినే ఆకాశం, శక్తి, మాయా, ఆవిద్య అనే వాటిలో ఏ పేరుతోనైనా పిలవవచ్చు. చక్రం అంతా చట్రం మీద ఆధారపడి ఉన్నట్లు ఈ సృష్టి అంతా ప్రకృతిమీద ఆధారపడి ఉన్నది.)

ఈ చక్రానికి మూడు ఇనుప పట్టాలున్నాయి. (అంటే పైన చెప్పిన చట్రంచుట్టూ మూడు ఇనుప పట్టాలు– సత్త్వ రజ స్తమోగుణాలు– చుట్టబడి ఉన్నాయి.)

ఈ చక్రానికి పదహారు కొనలు ఉన్నాయి. (పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు అయిదు, కర్మేంద్రియాలు అయిదు, మనస్సు మొత్తం 16 లేదా ప్రశ్నోపనిషత్తులో (6వ ప్రశ్న 4వ మంత్రం) చెప్పినట్లుగా (ప్రాణం మొదలుకొని నామం వరకు గల కళలని చెప్పవచ్చు) వీటితో సృష్టి క్రమం పూర్తి అవుతుంది కాబట్టి ఇవి కొనలుగా చెప్పబడ్డాయి.

ఈ చక్రంలో యాభై ఆకులు ఉన్నాయి.

## విపర్యయాలు- 5

| | | |
|---|---|---|
| ఆశక్తులు - 28 | బాహేంద్రియాలకు సంబంధించిన ఆశక్తులు మూగ, చెవుడు మొదలైనవి | 11 |
| తుష్టులు - 9 | పురుషార్థ యోగ్యతలు లేక పోవుట మొదలైన తుష్టులకు వ్యతిరిక్తమైనవి. | 9 |
| సిద్ధులు- 8 | సిద్ధులకు వ్యతిరిక్తమైన ఆశక్తులు | 8 |
| 50 | | 28 |

## విపర్యయాలు- 5

**1. తమము :** సాంఖ్యసమ్మతమైన 8 ప్రకృతులందు ఆత్మ భావం కలిగి ఉండటం.

**2. మోహము :** అణిమాది అష్టసిద్ధులే మోహం.

**3. మహామోహము :** లౌకిక విషయాలు అయిదింటిమీద సత్యత్వ బుద్ధి.

**4. తామిస్రము :** ఐశ్వర్యం ద్వారా చూచినట్టి, విన్నటి విషయాలు లభించనప్పుడు కలిగే క్రోధం.

**5. అంధతామిస్రము :** పైన చెప్పిన 18 (8+ 5 + 5) విషయాలను పూర్తిగా అనుభవించక మధ్యలోనే మరణం సంభవించటం వల్ల కలిగే శోకం.

**28 ఆశక్తులు :** ఇంద్రియాలకు సంబంధించిన మూగతనము. చెవుడు మొదలైనవి ॥

1. తుష్టలకు వ్యతిరిక్తమైనవి అంతఃకరణకు సంబంధించిన ఆశక్తులు 9.

అష్టసిద్ధులకు వ్యతిరిక్తమైన ఆశక్తులు 28 (11 + 9 + 8 = 28)

**9. తుష్టలు :** 1) ప్రకృతిజ్ఞానంతో కృతార్థుడైనట్లు భావించటం. 2) సన్న్యాసచిహ్నాలు ధరించినంత మాత్రాననే కృతార్థుడైనట్లు భావించటం. 3) ప్రకృతి విజ్ఞానంతోనే కొంత కాలానికి ముక్తి దానంతట అదే కలుగుతోంది, సన్న్యాసం అక్కరలేదనుకోవటం, 4) సంపదతో ముక్తి వస్తుందని అనుకోవటం, 5) విషయ సంగ్రహం అసంభవం అనుకొని వాటి నుండి విముఖుడవటం, 6) విషయసంగ్రహం చేయగలిగినా వాటిని రక్షించుకోలేమని విముఖుడై సంతోషించటం, 7) విషయాలలో తక్కువ ఎక్కువలు చూచి విముఖుడవటం, 8) విషయాల వల్ల ఎన్నడు తృప్తి కలుగదు అని తెలుసుకొని వాటియెడ విముఖుడవటం, 9) విషయ

సం(గహంలో నరక కారణమైన జీవహింస అనివార్యమని తెలుసుకొని  వాటియెడ విముఖుడవడం.

**8. సిద్ధులు :** ఊహ, శబ్దము, అధ్యయనము, అధ్యాత్మికాది త్రివిధ దుఃఖ విఘాతము, సుహృత్రాప్తి, దానము.

**1. ఊహ :** ఉపదేశము పొందకుండానే జన్మాంతర సంస్కారం వల్ల ప్రకృతి మొదలైనవాటి జ్ఞానం  కలగటం.

2. శబ్దాభ్యాసం  లేకుండానే శ్రవణమాత్రంతోనే జ్ఞానోత్పత్తిని తెలుసుకోవటం.

3. అధ్యయనము, శాస్త్రాభ్యాసంతోనే జ్ఞానం  కలుగుతుందని అనుకవోటం.

4,5,6, ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికమైన మూడువిధాల తాపాలను ఉపేక్షించినందు వల్ల తితిక్షువైనవాడికి  దానంతట అదే జ్ఞానం కలుగుతుందని అనుకోవటం.

7. సుహృత్ ప్రాప్తివల్ల జ్ఞానం కలుగుతుందని అనుకోవటం.

8. ఆచార్యునికి  ప్రియమైన వస్తువు యిస్తే జ్ఞానప్రాప్తి కలుగుతుందనుకోవటం. ఈ ఎనిమిది సిద్ధులు.

ఈ చక్రంలో 20 ఎదురు ఆకులు ఉన్నాయి– మధ్య ఉండే చిన్న ఆకులు (పది ఇంద్రియాలు, పది ఇంద్రియ విషయాలు– శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, వచన, గ్రహణ, గతి, త్యాగ, ఆనందాలు) ముఖ్యమైన ఆకుల బలంకోసం బిగించేవి ఎందురు ఆకులు– ప్రత్యరలు అంటారు.

## ఈ చక్రంలో ఆరు అష్టకాలున్నాయి :

**1) ప్రకృత్యష్టకం :** 1) పృథివి 2) జలం 3) అగ్ని 4) వాయువు 5) ఆకాశం 6) మనస్సు 7) బుద్ధి 8) అహంకారం.

**2) ధాత్వష్టకం :** 1) త్వక్ 2) చర్మము (బాహ్య, అంతశ్చర్మాలు) 3) రక్తము 4) మాంసము 5) క్రొవ్వు 6) అస్థి 7) మజ్జ 8) శుక్రము.

**3) ఐశ్వర్యాష్టకం :** 1) అణిమ 2) మహిమ 3) గరిమ 4) లఘిమ 5) ప్రాప్తి

6) ప్రాకామ్యము 7) ఈశత్తము 8) వశిత్వము.

4) భావాష్టకం : 1) ధర్మము 2) జ్ఞానము 3) వైరాగ్యము 4) ఐశ్వర్యము 5) ఆధర్మము 6) ఆజ్ఞానము 7) అవైరాగ్యము 8) అనైశ్చర్యము.

5) దేవాష్టకం : 1) బ్రహ్మ 2) ప్రజాపతి 3) గంధర్వ 5) యక్ష 6) రాక్షస 7) పితృ 8) పిశాచము.

6) గుణాష్టకం : 1) దయ 2) క్షమ 3) శౌచం 4) అనాయాసము 5) మంగళము 6) అనసూయ 7) అస్పృహ 8) అకృపణత్వం.

అనేక రూపాలుగా కనిపించే ఒకే పాశం (కామము) ద్వారా మూడు మార్గాలలో (ధర్మము, అధర్మము, జ్ఞానము) నడపబడుతూ, ఈ చక్రం యొక్క ప్రతిభ్రమణము రెండు వ్యతిరేక విషయాలను (పుణ్య పాపాలు లేదా సుఖదుఃఖాలు) సృష్టిస్తుంది. భ్రమణము అంటె తిరుగుట అనే అర్థంతోబాటు భ్రమ, మోహము అని కూడా చెప్పుకోవచ్చు.

కామము అనే పాశం స్వర్గాది విషయ భేదాలవల్ల అనేక విధాలుగా కనిపిస్తుంది. ఈ విశ్వ చక్రానికి మూడు మార్గాలు– ధర్మము, ఆధర్మము, జ్ఞానము అనేవి, మోహంవల్ల (ఆత్మ కాని దానిలో ఆత్మ అనేభావం ఉండటంవల్ల) పాప పుణ్యాలు అనే విరుద్ధ విషయాలు ఈ చక్రభ్రమణంలో కనిపిస్తున్నాయి.

ఈ విధమైన సంసార చక్రాన్ని ఆ మహార్షులు సాక్షాత్కరించుకొన్నారు.

***మం ॥ పంచస్రోతోంబుం పంచయోన్యుగ్ర వక్రాం***
***పంచ ప్రాణోర్మిం పంచ బుద్ధ్యాది మూలమ్.***
***పంచావర్తాం పంచదుఃఖౌఘ వేగాం***
***పంచాశద్భేదాం పంచపర్వామధీమః. 5***

ఈ మంత్రంలో నదిరూపంలో కార్యబ్రహ్మ నిరూపణం చేస్తున్నారు.

ఈ విశ్వాన్ని ఒక మహానదిగా ధ్యానిస్తున్నాము. ఈ మహానదిలో ఐదు ఉపనదులు కలుస్తున్నాం– పంచేంద్రియాలనే అయిదు ఉపనదులలోని నీరు ఈ మహానదిలో కలుస్తోంది. ఈ నది ఐదు కారణాలవల్ల (ఐదు భూతాలవల్ల– పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం)

ఐదువంపులు తిరుగుతోంది– ఐదు విధాలుగా ప్రవాహదిశ మారుతున్నట్లు కనిపిస్తుంది. ఈ నదిలోని అలలు పంచప్రాణాలు (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము) పంచేంద్రియాల యొక్క విషయాలను గ్రహించే మనస్సే ఈ నదికి ఉత్పత్తి స్థానము. అయిదు రకాలైన దుఃఖాలే (గర్భగత దుఃఖం, జన్మకాల దుఃఖం, వార్థక్యదుఃఖం, వ్యాధిజనిత దుఃఖం, మృత్యు దుఃఖం) ఈ నదికి ప్రవాహం– అంటే వేగాన్ని యిచ్చేవి. ఈ నదిలో ఐదు సుడిగుండాలు (పంచేంద్రియ విషయాలు– శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలు) ఉన్నాయి. ఈ నది అయిదు పాయలుగా– శాఖలుగా ఉంది (అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశాలు) ఇటువంటి విశ్వం అనే నదిని ఆ మహర్షులు సాక్షాత్కరించుకొన్నారు.

దీనిలో అనేక ఉపమానాలు, రూపకాలు కనిపిస్తాయి. పంచేంద్రియాల ద్వారా కలిగే విషయజ్ఞానమే ఈ నదిలోని నీరు. ఈ ప్రపంచానికి పంచభూతాలు కారణాలు. అందుచేత అని భయంకరంగాను, వంకరగాను కనిపిస్తున్నాయి. పంచ ప్రాణాలు లేదా వాక్కు మొదలైన అయిదు కర్మేంద్రియాలు ఈ నవిలోని ఆలలు. ఈ అయిదు ఇంద్రియావల్ల కలిగే అయిదు విధాలైన జ్ఞానాలకు మూలధారం మనస్సు, అందుచేత మనస్సు ఈ నదికి ఉత్పత్తి స్థానం. శబ్దము మొదలైన అయిదు విషయాలు ఈ నదిలోని సుడిగుండాలు. ఆజ్ఞానులు ఈ విషయ లోలత్వంలోపడి మునిగిచస్తూ ఉంటారు. దుఃఖాలే (పైన చెప్పిన 5 రకాల దుఃఖాలు) ఈ నది జల ప్రవాహం.

నదిజలం సముద్రంలో నుండి పుట్టి మళ్ళీ సముద్రంలోనే కలిసినట్లుగా ఈ విశ్వం పరమసత్తనుండి పుట్టి మళ్ళీ దానిలోనే విలీనం అవుతోంది. అనివేకులకు నది ప్రమాదకారణం– వివేకులకు ఉపయోగకారి. నదిలోని నీరు ప్రవాహంవల్ల ఎప్పటికుప్పుడు మారిపోతూ ఉన్నా, రెండు గట్లు ఉండటంవల్ల స్థిరంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అట్లాగే ఈ విశ్వం కూడా దేశకాలాలనే గట్లమధ్య అవిచ్ఛిన్నంగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆలోచించగా నది అనేది సముద్రం కంటె భిన్నంకాదు. అట్లాగే ఈ విశ్వం (కార్యబ్రహ్మ) పరమాత్మకంటె భిన్నంకాదు. ఈ పరమ సత్యాన్నే కావ్య సౌందర్యం ఉట్టిపడేటట్లు వర్ణించారు.

***మం॥ సర్వా జీవే సర్వసంస్థే బృహంతే***
***అస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే***
***పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా***
***జుష్ట స్తత స్తేనామృత త్వమేతి.*** **6**

జీవుడు ఈ సంసార చక్రంలో పరిభ్రమించే విధాన్ని, ఈ సంసారాన్నుండి ముక్తిపొందే విధాన్ని ఈ మంత్రంలో విశదీకరిస్తున్నారు.

జీవుడు ఈ అనంత బ్రహ్మచక్రంలో యాత్రికుడై పరిభ్రమిస్తూ ఉంటాడు. ఈ జీవుడు తానువేరు, సర్వనియంతమైన పరమాత్మ వేరు అని భావిస్తూ సమస్తానికి జీవనాధారము, ప్రళయస్థానము అయిన బ్రహ్మ చక్రంలో (విశ్వంలో) పరిభ్రమిస్తూ ఉంటాడు. ఎప్పుడైతే జీవుడు తాను, విశ్వ చోదకుడైన ఆ సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మ ఒకటే అని తెలుసుకుంటాడో అప్పుడు ఆ పరబ్రహ్మచేత అనుగ్రహింపబడి అమరత్వాన్ని పొందుతాడు– ముక్తుడౌతాడు. అట్లా కాకుండా భేదదృష్టి ఉన్నంత వరకు వివిధ యోనులలో పరిభ్రమిస్తూనే ఉంటాడు– జన్మలు పొందుతూనే ఉంటాడు.

***మం॥ ఉద్గీతమే తత్పరమం తు బ్రహ్మ***
***తస్మిం స్త్రయం సుప్రతిష్ఠాఽ క్షరంచ,***
***అత్రాంతరం బ్రహ్మవిదో విదిత్వా***
***లీనా బ్రహ్మణి తత్పరాః యోనిముక్తాః.*** **7**

బ్రహ్మప్రాప్తియే మోక్షమని చెప్పుతూ, బ్రహ్మలో ఏ విధంగా లీనం కావాలో ఈ మంత్రంలో చెపుతున్నారు.

కార్యకారణ రూపమైన ప్రపంచానికి అతీతమైనట్టిది పరబ్రహ్మం. ఈ ప్రపంచిక ధర్మాలేవీ ఆ పరబ్రహ్మకు వర్తించవు. అది (బ్రహ్మం) త్రిపుటులకు (దేశ, కాల, నిమిత్తాలు– భోక్త, భోగ్యం, నియామకం– జాగ్రత్, స్వప్న, సుషుప్తులు– ఇవన్నీ త్రిపుటలు) ఉత్తమమైన ఆశ్రయం. ఆది నాశరహితమైనది. బ్రహ్మజ్ఞానులైనవారు ఈ విషయం తెలుసుకొని (ఈ విశ్వమే బ్రహ్మను ప్రవేశించటానికి ద్వారమనే విషయం తెలుసుకొని) సమాధినిష్ఠులై, జన్మ మరణాలతో గూడిన ఈ సంసారాన్నుండి విముక్తులౌతారు. బాహ్యాభ్యంతర కారణాలన్నింటినీ స్వాధీనం చేసుకొని, మోక్షప్రాప్తిని కోరివవారై, వేదాంతాన్ని శ్రవణ మనన నిధి ధ్యాసల ద్వారా తెలుసుకొని. తానే ఆ పరబ్రహ్మననే భావంతో బ్రతికి ఉండగానే పురుషుడు మోక్షాన్ని పొందుతాడు.

***మం॥ సంయుక్త మేతత్ క్షరమక్షరంచ***

***వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః***

***అనీశశ్చాత్మ బధ్యతే భోక్తృ***

***భావాత్ జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః*** **8**

ఈ విశ్వమంతా క్షరాక్షరాలు, వ్యక్తా వ్యక్తాలు, స్థూల సూక్ష్మాలు, జడచేతనాలు మొదలైనవాటి కలయికతో ఏర్పడి ఉంది. అటువంటి ఈ విశ్వానికంతకు తన శక్తిద్వారా, స్ఫూర్తిద్వారా, భరణ పోషణ కారకుడైనవాడు పరమాత్మయే! ఈ పరమాత్మను గూర్చి తెలుసుకోవలేనంతవరకు ఈ జీవాత్మ మాయకు వశమై ప్రాపంచిక సుఖాలలో బద్ధమై ఉంటుంది. పరమాత్మయొక్క సాక్షాత్కారం కలగగానే (నేనే బ్రహ్మను అనే జ్ఞానం) ఆ బంధనాలన్నీ విడిపోతాయి.

***మం॥ జ్ఞా జ్ఞౌ ద్వావజా వీశనీశావజా***

***హ్యేకా భోక్తృ భోగ్యార్థయుక్తా***

***అనంతశ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా***

***త్రయం యదావిందతే బ్రహ్మమేతత్.*** **9**

జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి ఈ మూడింటి భేదము వాటియొక్క యదార్థ్యాన్ని గ్రహించవటంవల్ల మోక్షప్రాప్తికలుగుతుందని ఈ మంత్రంలో చెపుతున్నారు.

పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు, స్వతంత్రుడు. జీవుడు అల్పజ్ఞుడు, అసమర్థుడు, పరతంత్రుడు. అయితే చైతన్య స్వరూపమైన కర్త. అచేతనమైన కర్మ ఇద్దరూ జన్మరహితులే! అట్లాగే స్వతంత్రుడైన యజమాని. అస్వతంత్రుడైన సేవకుడు ఇద్దరూ జన్మలేనివారే ! ఈ రెంటి మధ్య (కర్త- కర్మ, భోక్త- భోగ్యం, యజమాని- సేవకుడు, పరమాత్మ- జీవాత్మలు) ఈ భోక్తభోగ్య సంబంధాన్ని కలిగించే మాయ (ప్రకృతి) కూడా జన్మలేనిదే! ఎప్పుడైతే ఈ మూడూకూడా జన్మలేనివే అని (వీటిలో అభేదాన్ని) గుర్తిస్తామో అప్పుడు ఆత్మ. ఈ అనంతవిశ్వమే తన స్వరూపంగా కలది ఔతుంది. దానితో కర్తృత్వ భావం నుండి విముక్తి పొందుతుంది- ఆకర్త అవుతుంది. పరమాత్మ, జీవుడు, మాయ ఇది త్రిపుటి, మాయకు

గల అనిర్వచనీయమైన శక్తివల్ల కర్త కర్మల సంబంధం (పరమాత్మ జీవాత్మల సంబంధం) ఏర్పడుతోంది. దానివల్ల దుఃఖాలు అనువించాల్సి వస్తోంది. ఈ మాయయొక్క ప్రభావం లేకపోతే– సమాధిస్థితిలో – ఈ సంబంధం (ప్రకృతి) కర్త, కర్మలు మూడు పరమాత్మలో లీనమైపోతాయి. అప్పుడు ఆత్మకు తన ఆనంతత్వం, తానే విశ్వాత్మననే సత్యం సాక్షాత్కారమౌతుంది.

***మం॥ క్షరం ప్రధాన మమృతాక్షరం హరః***
***క్షరాత్మనా వీశతే దేవ ఏకః,***
***తస్యాభిధ్యానా ద్యోజనాత్తత్త్వ***
***భావాత్ భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః. 10***

పదార్థము నశ్వరమైనది. పరమేశ్వరుడు నాశనం లేనివాడు. ఈ 'హరుడు' అనే అద్వితీయుడైనట్టి సచ్చిదానంద స్వరూపుడైన ఆ భగవంతుడే పదార్థాన్ని, జీవాన్నీ కూడా పరిపాలిస్తాడు– ఈ రెంటిమీదా కూడా ఆధిపత్యం పరమాత్మదే! ఆ పరమాత్మను ధ్యానించటంవల్ల, ప్రారబ్ధ కర్మ ఫలానుభవం పూర్తి అయిపోగానే అన్ని విధాలైన ఆభాసలు తొలగిపోతాయి. పరబ్రహ్మలో తాదత్మ్యం సిద్ధిస్తుంది.

***మం॥ జ్ఞాత్వా దేవం సర్వపాపహానిః***
***క్షీణైః క్లేశై ర్జన్మమృత్యు ప్రహాణిః,***
***తస్యాభిధ్యానా తృతీయం దేహభేదే***
***విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః. 11***

ఆత్మజ్ఞానంవల్ల, ఆత్మధ్యానంవల్ల కలిగే ఫలితాలను, వాటిలోగల తేడాను వివరిస్తున్నారు.

పరమాత్మను తెలుసుకోవటంతోనే ఆవిద్య మొదలైన బంధనాలన్నీ విడిపోతాయి. దుఃఖాలు, జనన మరణాలుకూడా ఉండవు. ఇది ఆత్మజ్ఞాన ఫలం.

ఆ పరమాత్మను ధ్యానం చేయటంవల్ల దేహస్మృతి పోయి, శరీరపాతం జరిగిన తరువాత, సర్వైశ్వర్య మయమైనట్టి, కారణ బ్రహ్మ స్వరూపమైన తృతీయావస్థ ప్రాపిస్తుంది.–

అంటే దేహస్థితిని దాటి, తానే యావద్విశ్వానికి పాలకుడనే స్థితిని పొందుతాడు. అంటే రెండవది లేనివాడౌతాడు. అటువంటివాడు ఆప్తకాముడు. అతనికి తీరని కోరికలంటూ ఉండవు.

ఈ స్థితిని పొందాలంటే వేదశాస్త్రాలు చదవటం ద్వారా జ్ఞానార్జనము తద్వారా అవిద్యాక్షయము, ఈజన్మ తరువాత జన్మరాహిత్యం, నిరంతర భగవద్ధ్యానంవల్ల దేహస్మృతి తొలగటం, తరువాత విశ్వానికి ప్రభువుననే భావం, తద్వారా ఆప్తకామత్వం, తానే అద్వితీయమైన పరబ్రహ్మమవటం, ఇవన్నీ క్రమపరిణామాలు.

***మం॥ ఏతజ్జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం***
***నాతః పరం వేదితవ్యం హి కించిత్***
***భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా***
***సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్. 12***

తన అంతఃకరణలో ఆత్మరూపంలో సర్వదా ఉన్న బ్రహ్మను తెలుసుకోవాలి. ఇంతకు మించి తెలుసుకోవలసింది ఏదీలేదు. అంటే ప్రతి వానిలోను బ్రహ్మసాక్షాత్కారానికి పూర్వం కూడా ఈ పరబ్రహ్మ ఆత్మ రూపంలో ఉండనే ఉంటుందని భావం- ఇది క్రొత్తగా ఎక్కడనుండో వచ్చేదేమీకాదు.

జీవుడు, జగత్తు, నియామకుడు ఈ మూడూ కూడా బ్రహ్మము యొక్క మూడు భంగిమలు అని గుర్తించాలి. అంటే ఈ మూటికి భేదం లేదు. జీవుడు, జగత్తు, నియామకుడు అనే యీ మూడింటి క్రిందికే లోగడ చెప్పుకొన్న కాలము, ప్రకృతి, నియమం, యదృచ్ఛ మొదలైనవన్నీ వస్తాయి.

***మం॥ వహ్నేర్యథా యోనిగతస్య మూర్తి ర్న***
***దృశ్యతే నైవచ లింగనాశనః***
***స భూయ ఏ వేంధన యోనిగృహ్యా***
***స్తద్వోభయం వై ప్రణవేన దేహే. 13***

అగ్నికి ఆశ్రయమైనది కట్టె, అగ్ని ఆ కట్టెలో అవ్యక్తంగా దాగి ఉంటుంది. ఆ కట్టెను మండించినప్పుడు వ్యక్తమౌతుంది. మండించనప్పుడు కూడా సూక్ష్మరూపంలో ఆ

అగ్ని ఆకట్టెలో ఉండనే ఉన్నది. అట్లాగే ఆత్మ సాక్షాత్కారానికి ముందు, ఆత్మసాక్షాత్కారమైన తరువాత కూడా దేహంలో ఆత్మయొక్క స్థితి ఆ కట్టెలో అగ్నిలాగానే ఉంటుంది. కట్టెలో అగ్ని నాశనం కాదు. కట్టెను మండించటం ద్వారా మళ్ళీ దానిని పొందవచ్చు. కట్టెను రగుల్కొల్పి అగ్నిని పొందినట్లే, ప్రణవాన్ని (ఓం కారం) ధ్యానించటం ద్వారా శరీరంలో ఆత్మను దర్శించవచ్చు.

***మం॥ స్వదేహ మరణిం కృత్వా ప్రణవం చోత్తరారనిం.***
***ధ్యావ నిర్మథనాభ్యాసా ద్దేనం పశ్యేన్ని గూఢవత్. 14***

అగ్నిని రగుల్కొల్పటానికి రెండు కట్టెలను మధిస్తారు. ఆ రాపిడి వల్ల అగ్ని పుడుతుంది. ఆ కట్టెను అరణి అంటారు.

తన శరీరాన్ని క్రిందకట్టెగాను (అరణి) ఓంకారాన్ని (ప్రణవాన్ని) పైన రాపిడి కలిగించే కట్టెగాను చేసుకొని, ధ్యానమే మధించటంగా (రాపిడి కలిగించటంగా అభ్యాసం చేయాలి. అట్లా చేస్తే మనలో నున్న బ్రహ్మను సాక్షాత్కరించుకోగలుతాము- కట్టెలో దాగి ఉన్న అగ్నిలాగా మనలోనున్న బ్రహ్మాన్ని చూడగలుగుతాము.

***మం॥ తి లేషు తైలం దధినీవసర్పి రాపః స్రోతః సర్వణిషు చాగ్నిః***
***ఏమ మాత్మాఽ త్మని గృహ్యతేఽ సౌ సత్యేవైనం తపసాయోను పశ్యతి. 15***

నువ్వులలో నూనెలాగా, పెరుగులో వెన్నలాగా, భూగర్భ ప్రవాహాల్లో నీరులాగా అరణిలో అగ్నిలాగా పరామత్మను మనయందే దర్శించవచ్చు. అయితే నూనె, వెన్న మొదలైనవాటిని పొందాలంటే కొంత ప్రయత్నం, శ్రమ అవసరం. అట్లాగే పరమాత్మను దర్శించాలన్నా ప్రయత్నం, శ్రమ తప్పదు- సత్యము; ఇంద్రియ నిగ్రహము, తపస్సు ధ్యానం వీటిని సాధనాలుగా చేసుకొని, అధికారియైనవాడు (యోగ్యత కలవాడు) తానే జ్ఞానస్వరూపుడైన బ్రహ్మకాగలడు. అధికారి అయినవాడు అంటే ఎల్లప్పుడు నిష్ఠతో బ్రహ్మను అన్వేషించేవాడు.

నువ్వులలో నూనెను. పెరుగులోవెన్నను భూగర్భ స్రోతస్సులో నీటిని, అరనిలో అగ్నిని ఈ నాలుగు ఉపమానాలు మనలోనున్న పరమాత్మను ఉద్దేశించి చెప్పబడ్డాయి. ఈ

ఉపమనాలు సర్వవ్యాపకత్వాన్ని, భక్తివల్ల నిరాకారుడు. సాకారుడు కావటానికి ప్రత్యక్షం కాగానే ప్రయత్నం విరమించటానికి అంతర్యామిత్వాన్ని సూచించే సాధారణ ధర్మాలు కలవి.

***మం॥ సర్వవ్యాపివ మాత్మావం క్షీ రే సర్పరివార్పితమ్***
***ఆత్మ విద్యా తపోమూలం తద్బ్రహ్మోపనిషత్ వరమ్.*** **16**

తపస్సు, ఆత్మజ్ఞానము ఈ రెండే ఆత్మసాక్షాత్కారానికి సాధనాలు. సత్యము, తపస్సు ఈ రెంటిద్వారానే పాలలోకలసిఉన్న వెన్నలాగా అంతటా వ్యాప్తమైఉన్న పరమాత్మను దర్శించగలుగుతాము. అజ్ఞానాన్ని నిర్మూలించే ఆ పరమాత్మ దర్శనానికి (ఈ ఉపనిషత్తులో చెప్పబడే) సత్యం, తపస్సే సాధనాలు.

# పునఃర్విమర్శనము

ఇంతవరకు, కాలము మొదలైన వేవీ విశ్వకారణం కాదని; బ్రహ్మమే విశ్వకారణమనీ చెప్పి. ఈ జగత్కారణమైన బ్రహ్మను చక్ర రూపంలో, నదిరూపంలో నిరూపించారు. తరువాత, జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు ఈ మూడింటిని గూర్చిన యదార్థ జ్ఞానాన్ని చెప్పి, బ్రహ్మ సాక్షాత్కార పద్ధతిని బోధించారు

# ద్వితీయాధ్యాయము

***మం॥ యుంజానః ప్రథమం మన స్తత్వాయ సనితా ధియః॥***
***అగ్నేర్జ్యోతిర్ని చాయ్య పృథివ్యా అధ్యాభతత్ ॥*** **1**

1 నుండి 5వ మంత్రంవరకు బ్రహ్మదర్శనానికి అవసరమైన సాధనాలను గూర్చి చెపుతున్నారు. ఈ మంత్రాలు యాగాది కర్మకాండలలో కూడా ఉపయోగింపబడుతున్నాయి– ఈ ఉపనిషత్తులో యోగమార్గాన్ని నిర్దేశిస్తున్నాయి. ఆధ్యాత్మిక సాధనకు తానుగా నిర్ణయించుకొన్న క్రమశిక్షణ చాలా అవసరం. ఆ నియమాలు ఈ మంత్రాలలో సూచితమైనాయి. కాబట్టి యోగవిద్యకు కూడా ఈ మంత్రాలు ప్రామాణికాలే !

సవితృడు, మా యింద్రియాలను, మనస్సును, ముఖ్యప్రాణాన్ని పరమాత్మతో అనుసంధంప చేయుగాక! (సవితృడు అంటే ఈ విశ్వానికి దాని పరిణామానికి మూల

ధారమైన అంతర్యామి) అగ్ని మొదలైన దేవతలు ఇంద్రి యాభిమానులైన దేవతలు. వారికి విషయాల్ని ప్రకాశింపచేసే శక్తి ఉంది. ఆశక్తియే జ్యోతి. అటువంటి దేవతలయొక్క జ్యోతిని కనుగొని దానిద్వారా ఈ భౌతిక విషయాలకు అతీతమైన తత్త్వాన్ని దర్శించటానికి మా ఇంద్రియాలను స్థిరంగా ఉంచుకుంటాము.

మన ఈ ఇంద్రియాలు భౌతిక విషయాల్ని తెలుసుకోగలుగుతాయి. కాని భౌతిక విషయాలను అతీతమైన తత్త్వాన్ని దర్శించలేవు. ఆ తత్త్వాన్ని దర్శించటానికి దైవశక్తి లేదా జ్యోతి అవసరం. ఆ వెలుగు సహాయంతో ఆ తత్త్వాన్ని దర్శించగలుగుతాం. అందుకుగాను ఈ ఇంద్రియాలను నిగ్రహించుకొని అదుపులో ఉంచుకోవాలి. అంటే ఇంద్రియాభిమానులైన దేవతలు ఆత్మదర్శనం కోసం తమతమ ఇంద్రియాలోనే తమ శక్తిని ఆధానం చేయాలి. బ్రహ్మసాక్షాత్కారానికి ఇంద్రియనిగ్రహ సామర్థ్యం అవసరం –ఇంద్రియాలను ఆంతర్ముఖం చేయాలి. నిత్యానిత్య వివేకం కలగాలి. సవితృ శబ్దానికి మామూలుగా సూర్యుడని అర్థం చెప్పుకుంటున్నా. ఇక్కడ అన్ని ప్రాణుల్లోను నిరంతరాయంగా ఉంటు కృషికి కారణభూతుడైన అంతర్యామిగా గ్రహించాలి. నిరంతరాయంగా ఉంటూ సృష్టికి కారణభూతుడైన అంతర్యామిగా గ్రహించాలి.

***మం॥ యుక్తేన మనసావయం దేవస్య సవితుః సవే! సువర్గే***
***యాయశక్త్యా ॥*** **2**

దివ్యవక్తి సంపన్నుడు, స్వయంప్రకాశమానుడు, అయిన పరమాత్మను పొందటంకోసం, యోగయుక్తమైన మనస్సుతో, ఆ పర్మమాత్మ యొక్క సాక్షాత్కారానికి అవసరమైన సాధనాలను పొందటం కోసం ప్రయత్నం చేస్తాము. తగిన సాధనసంపత్తి ఉంటేనేగాని లభ్యమైన దానిని కూడా పొందలేము.

అంటే, పరమాత్మ ప్రాప్తికి అవసరమైన వైర్యాగ్యాన్ని, అభ్యాసాన్ని సాధిస్తాము అని భావం. ఈ సాధనాలు లభించాలంటే అందుకు ఆ పరమాత్మ యొక్క అనుగ్రహం కూడా ఉండాలి.

***మం॥ యుక్త్వాయ మనసాదేవాన్ సువర్యతో ధియా దివమ్॥***
***బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్ ॥*** **3**

బాహ్య విషయానుభవం వల్ల కలిగే ఆనందం కోసం ఇంద్రియాలు ప్రాపంచిక సుఖాలను కోరుతూ ఉంటాయి. ఆ ఇంద్రియాలను మనస్సు చేత బుద్ధిచేత నిగ్రహించాలి. అయితే, ఇంద్రియ నిగ్రహ మనేది అంత తేలికగా అలవడేది కాదు– మనస్సు బుద్ధి ద్వారా వాటిని నియమించటానికి, మరల్చటానికి ప్రయత్నం చేయాలి. ఇందుకు కూడా పరమాత్మ అనుగ్రహం కావాలి. స్వయం ప్రకాశమానుడు, జ్యోతిస్వరూపుడు, మనస్సుకు బుద్ధికి కూడా అతీతుడు అంతర్యామి మా ఇంద్రియాలకు బాహ్య విషయాలమీద వ్యామోహం లేకుండా ఉండే శక్తిని ప్రసాదించుగాక!

***మం॥ యుంజతే మన ఉతయుంజ తే ధియో***
***విప్రా విప్రస్య బృహతో విపశ్చితః।***
***విహోత్రాదధే వయునా విదేక***
***ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః ॥*** **4**

అంతటా వ్యాపించి ఉన్నవాడు, సర్వజ్ఞుడు, స్వయంజ్యోతి అయిన ఆ అంతరాత్మ యొక్క మహిమ చాలా గొప్పది. ఇంద్రియ నిగ్రహం కలిగి, తపస్సు ద్వారా, ధ్యానం ద్వారా, గురూపదేశం ద్వారా ఒకంత మంది మాత్రమే ఆ పరమాత్మను దర్శించటానికి అవసరమైన నియమాలను అభ్యసిస్తారు. మనస్సుయొక్క, బుద్ధి యొక్క ప్రవృత్తులను నిగ్రహించి, ఏకాగ్రతతో తపోధ్యానాదులను సాధనచేసే వారే నిజమైన విప్రులు.

***మం॥ యుజేవాం బ్రహ్మ పూర్వ్యం నమోభి***
***ర్విశ్లోక ఏతు పథ్యేవ సూరేః।***
***శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః***
***ఆయేధామాని దివ్యాని తస్థుః॥*** **5**

పైన చెప్పిన బుద్ధిమంతుల మార్గానే అనుసరించి, సంతత ధ్యానం ద్వారా మీ యిద్దరిని (మనస్సును, బుద్ధిని) ఆ సనాతనమైన బ్రహ్మమునందు లీనం చేస్తున్నాను. జ్యోతిస్వరూపుడు ఆవిర్భవించుగాక! సమాహిత బుద్ధితో నమస్కరిస్తున్నాను. అమృతపుత్రులు (దివ్య ధామాన్ని– పరబ్రహ్మను చేరటానికి సమర్థులు) అందరు వినదురుగాక! అంతా అమృతపుత్రులే ! కాబట్టి అందరు వినవలసిన విషయమే ! ఆ వినవలసిన విషయమేమటి?

ప్రాపంచిక సుఖాలు అనిత్యమని, బ్రహ్మానందం నిత్యమని, దానికోసం ప్రయత్నం చేయటం మన అందరి విధి' అని.

ఇంతవరకు బ్రహ్మసాక్షాత్కారానికి కావలసిన సాధనాలు, నిత్యానిత్య వస్తువివేకం, మనో బుద్ధుల నియంత్రణం, నిరంతరాభ్యాసం, సమాధి (బ్రహ్మలీనత) వీటిని గురించి వివరించారు.

***మం॥ అగ్నిర్యత్రాభి మథ్యతే వాయుర్యత్రాధి రుధ్యతే ।***
***సోమో యత్రాతి రిచ్యతే తత్రసంజాయతే మనః॥ 6***

అగ్న్యాధానాది కర్మలలో అగ్ని మథించబడుతోంది. ప్రాణా యామాది కర్మలలో వాయువు నిరోధింపబడుతోంది. వేదాల్లో చెప్పబడిన యజ్ఞయాగాది కర్మల్లో సోమరసం పొంగిపొర్లి పోతుంది. పైన చెప్పిన ఈ కర్మల్లో మనస్సు పరిపూర్ణతను పొందుతుంది. అంటే మనస్సు ఆ యా కామ్యకర్మలలో లీనమై అంతటితో ఆగిపోతుంది.

కాబట్టి, కామ్యకర్మలకు బదులుగా అనాసక్తకర్మను భగవదారాధనగా రూపొందించు కోవాలి. ఆత్మ సమర్పన అలవరుచుకోవలి. అటువంటి అనాస్తక యోగిన్ని ఆరంభించటానికి ఉపాసకుడు సనితృదేవుని (అంతరాత్మయొక్క) అనుమతిని కోరుతున్నాడు.

***మం॥సవిత్రా ప్రసవేన జుషేత బ్రహ్మ పూర్వ్యమ్ ।***
***యత్ర యోనిం కృణవసే న హితే పూర్తమక్షిపతే॥ 7***

ఈ మంత్రంలో వెనుక చెప్పిన యోగసమస్వయాన్ని చెపుతున్నారు. యోని అంటే జన్మస్థానము. మనస్సు పుట్టుక అని కొంతమంది, సమాధి అని కొంతమంది అర్థం చెపుతున్నారు. పూర్తములు అంటే దానకర్మలు. పరమాత్మ అనుగ్రహాన్ని పొంది బ్రహ్మోపాసనచేయాలి. ఆ బ్రహ్మమందే సమాధి నిష్ఠుడు కావాలి.

ఏ పరమాత్మను సాక్షాత్కరించుకోవటంవల్ల పుట్టుకను (మనస్సును) నిర్మూలించటానికి వీలవుతుందో, ఏ పరబ్రహ్మను పొంది, ఇష్టాపూర్తములు మొదలైన సమస్త కర్మలయొక్క ఫలంచేత బాధింపబడవలసిన అవసరం ఉండదో, అటువంటి అధికారణమైన నిర్గుణ బ్రహ్మన్ని ఉపాసించాలి. దానికిగాను ఆ పరబ్రహ్మయొక్క అనుగ్రహం పొందాలి. ఈ విధంగా

ఉపాసన చేయటంవల్ల కామ్య కర్మలు నిన్ను బంధించవు. నిష్కామంగా చేసిన విహితకర్మలు అంతఃకరణ శుద్ధిద్వారా మోక్షానికి కారణమౌతాయి. విశుద్ధమైన అంతఃకరణయందే బ్రహ్మజిజ్ఞాన కలుగుతుంది. పిమ్మట వేదాంత విచారణవల్ల కలిగే బ్రహ్మాత్మైక జ్ఞానంవల్ల సమస్తకర్మలు భస్మమైపోతాయి.

***మం॥ త్రిరున్నం స్థాప్య సమంశరీరమ్***
***హృదీంద్రియాణి మనసా సన్నివేశ్య।***
***బ్రహ్మోడుపేన ప్రత రేతవిద్వాన్***
***స్రోతాంసి సర్వాణి భయావహాని॥*** **8**

ఈ మంత్రంలో ధ్యానయోగం యొక్క ప్రాశస్త్యం, దాని విధానం చెపుతున్నారు.

రొమ్ము, మెడ, తల ఈ మూడింటిని నిటారుగా ఉంచి, మనస్సుతో సహా ఇంద్రియాలన్నింటిని హృదయకమలంలో నియంత్రించి, ఓంకారమనే నౌక సహాయంతో విద్వాంసులైనవారు ఈ భయానకమైన ఈ ప్రవాహాన్ని దాటాలి. ప్రణవమనేది బ్రహ్మకు ప్రతీక. కాబట్టి బ్రహ్మమనే తెప్పతో లేదా ఓంకారమనే తెప్ప (నౌక)తో అని చెప్పుకోవచ్చు. భయంకరమైన ఈ సంసారసాగరాన్ని తరించటానికి ధ్యానయోగాన్ని సాధనంగా చెప్పారు.

***మం॥ ప్రాణాన్ ప్రపీడ్యేహ సంయుక్త చేష్టః***
***క్షీణే ప్రాణే నాసిక యోచ్ఛ్వసీత,***
***దుష్టాశ్వయు క్తమివ వాహమేనం***
***విద్వాన్మనో ధారయేతా ప్రమత్తః॥*** **9**

ఈ మంత్రంలో ప్రాణాయామ విధిని, దాని గొప్పతనాన్ని విశదీకరిస్తున్నారు.

యోగాభ్యాసం చేసేవాడు. యుక్తాహార విహారములు కలవాడై ఉండాలి. ప్రయత్నంలో ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవాలి. దీనినే యమము అంటారు. అహింస, దొంగతనం చేయపోవటం శౌచము. బ్రహ్మచర్మం, సత్యము, అపరిగ్రహము (దానం తీసుకోకుండా ఉండటము) వీటిని సాధనచేయటం వల్ల వాసనలు నశిస్తాయి. శరీర కార్యాలను కూడా నియమించుకోవాలి. శుచిగా ఉండటం, సంతోషం, వేదాధ్యయనం, తపస్సు, ఈశ్వరభక్తి ఇవన్నీ నియమాలు. యమ నియమాలు ఉంటేనే గాని యోగసాధన సంభవం కాదు.

ఇక, ప్రాణాయామం విషయం, ఇంద్రియాలన్నింటిని అదుపులో ఉంచుకొని, శరీర కార్యాలను జాగ్రత్తగా నియమిస్తూ ప్రాణశక్తి ఉపశమించినపుడు, ప్రాణాన్ని నిరోధించి, ముక్కు రంధ్రాలద్వారా మెల్లగా శ్వాస వదలాలి. పిమ్మట విద్వాంసుడైనవాడు ఏ మాత్రం ఆజాగ్రత్త లేకుండా దుష్టాశ్వాన్ని కళ్ళెంతో బిగించి పట్టినట్లుగా మనస్సును నిగ్రహించాలి. అయితే ఈ ప్రాణాయామ మనేదానిని ఎంత వర్ణించి చెప్పినా గురువు వద్ద అభ్యాసం చేయటమే మంచిది. ఇష్టం వచ్చినట్లు చేస్తే ఆపాయం కూడా కలగవచ్చు.

***మం॥ సమేశుచౌ శర్క రావహ్ని వాలుకా***

***వివర్జి తే శబ్దజలాశ్రయాదిభిః।***

***మనోనుకూలే నతు చక్షు పీడనే***

***గుహాని వాతాశ్రయణే ప్రయోజయేత్॥*** **10**

యోగాభ్యాసానికి అనుకూలమైన స్థలం ఎట్లా ఉండాలో చెపుతున్నారు.

మిట్ట పల్లాలు లేకుండా సమతలంగా ఉండి, చిన్న చిన్న రాళ్ళ ముక్కలు లేకుండా, ఇసుక దుమ్ము లేకుండా, తేమ బురద లేకుండా, అగ్ని బాధలుగాని, ధూళిదుమారములుగాని లేనట్టి పోట్లాటలు, అల్లర్లు, కేకలు లేనట్టి, కండ్లకు ఇంపుగా ఉన్నట్టి స్థలాలు, ముఖ్యంగా పెద్దపెద్ద హోరుగాలులు లేకుండా ఉండే గుహలవంటి ప్రదేశాలు అనుకూలంగా ఉంటాయి. అటువంటి నయనానందకరమై శారీరక బాధలు కలిగించని ఏకాంత ప్రదేశాల్లో యోగాభ్యాసం ప్రారంభించాలి. మనస్సు స్థిరంగా ఉండాలంటే బాహ్యపరిసరాలు అందుకు అనుకూలంగా ఉండాలన్న మాట.

***మం॥ నీహార ధూమార్కానిలానలానాం***

***ఖద్యోత విద్యుత్ స్పటిక శశీనామ్।***

***ఏతాని రూపాణి పురః సరాణి***

***బ్రహ్మణ్యభివ్యక్తిక రాణి యోగే॥*** **11**

యోగాభాస్యం చేసేటప్పుడు, బ్రహ్మ సాక్షాత్కారానికి ముందుగా, యోగసిద్ధికి సూచనగా కనిపించే రూపాలనుగూర్చి వివరిస్తున్నారు.

యోగాభ్యాసం  చేస్తూండగా మొదట్లో మంచు, పొగ, సూర్యుడు, గాలి, అగ్ని, మిణుగురులు, మెరపు స్ఫటికం, చంద్రుడు, ఈ రూపాలు కనిపిస్తాయి. ఇవన్నీ బ్రహ్మ సాక్షాత్కారానికి ముందు అభివ్యక్తమయే రూపాలు. ఇవి ఈ క్రమంలో సాక్షాత్కరిస్తూ ఉంటే బ్రహ్మసాక్షాత్కారం వైపు పురోగమిస్తున్నామని గ్రహించవచ్చు. యోగసిద్ధి- బ్రహ్మ సాక్షాత్కారం సమీపంలోనే ఉందని సంకేతం. ఇవన్నీ బ్రహ్మసాక్షాత్కారానికి పూర్వం సాధకుని మనస్సులో జనించే మానసిక స్థితులు.

***మం॥ పృథివ్య ప్తేజోఽనిలఖే సముత్థితే***
***పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే,***
***న తస్య రోగో న జరా న మృత్యుః***
***ప్రాప్తస్య యోగాగ్ని మయం శరీరం ॥ 12***

పంచభూతాలమీద (భూమి, అగ్ని జలం, వాయువు, ఆకాశం) మనస్సు కేంద్రీకరించి నందువలన అయిదువిధాలైన యోగసాక్షాత్కారం లభిస్తుంది. అంటే అయిదువిధాలైన యోగానుభవాలు కలుగుతాయి. అప్పుడా సాధకుని శరీరం యోగాగ్నిమయమౌతుంది. అంటే, భౌతిక శరీరం యోగాగ్ని దగ్ధ మౌతుంది. కాబట్టి రోగాలు, వార్థక్యం, అకాల మృత్యువు అతనికి ఉండవు- అతనిని బాధించవు.

***మం॥ లఘుత్వ మారోగ్య మలోలుపత్వం***
***వర్ణ ప్రసాదః స్వరసౌష్టవంచ,***
***గంధః శుభో మూత్ర పురీషమల్పం***
***యోగ ప్రవృత్తిం ప్రథమాం వదంతి ॥ 13***

ఈ మంత్రంలో సాధకుడు రోగాదుల మీద విజయం పొందేముందు ఉండే లక్షణాలు చెవుతున్నారు.

యోగాభ్యాసం చేసేటప్పుడు మొదట శరీరం తేలికగా ఉన్నట్లు అనిపిస్తుంది. శారీరక, మానసిక ఆరోగ్యం బాగుంటుంది. విషయాలమీద కోరికలు తగ్గిపోతాయి. శరీరకాంతి స్వచ్ఛంగా ఉంటుంది. కంఠస్వరం గంభీరంగా శ్రావ్యంగా ఉంటుంది. శరీరం నుండి

సుగంధం వస్తుంది. మలమూత్ర విసర్జనాది క్రియలు తగ్గిపోతాయి. ఇవన్నీ యోగసిద్ధికి పూర్వం కనిపించే లక్షణాలు.

*మం॥ యథైవ బింబం మృదయోపలి ప్తం*
*తేజోమయం భ్రాజతే తత్ సుధాంతం ।*
*తద్వాఽ ఽ త్మ తత్త్వం ప్రశమీక్ష్య దేహీ*
*ఏకః కృతార్థో భవతే వీతశోకః ॥* **14**

దుమ్ముకొట్టుకొని, మలినమై, కాంతివిహీనంగా ఉండే లోహబింబం (సువర్ణాది ధాతు నిర్మితమైన చక్రం) అగ్నిచేత శోధింపబడి ప్రకాశించేటట్లుగా, దేహంలో ఉండే జీవుడు కూడా ఆత్మయొక్క తత్త్వాన్ని సాక్షాత్కరించుకొని, అద్వితీయుడై, కృతార్థుడై శోకరహితుడు అవుతున్నాడు.

*మం॥ యదాత్మ తత్త్వేన తు బ్రహ్మ త త్త్వం*
*దీపోపమేనేహ యుక్తః ప్రపశ్యేత్ ।*
*అజం ధ్రువం సర్వతత్త్వైర్విశుద్ధం*
*జ్ఞాత్వా దేవం ముచ్చతే సర్వపాశైః ॥* **15**

యోగాభ్యాసం చేసే సాధకుడు దీపంలాంటి తన ఆత్మతత్త్వం చేత బ్రహ్మతత్త్వాన్ని దర్శిస్తాడు. ఆ విధంగా అపరోక్షానుభూతి పొందినపుడు ఆ స్థితి జన్మరహితమైనదని, నిశ్చలము, దివ్యము, పవిత్రము, వికార రహితము, శాశ్వతము అని గుర్తించి సమస్త బంధనములు నుండి విముక్తుడు అవుతాడు. ఆత్మతత్త్వం చేత బ్రహ్మతత్త్వాన్ని గుర్తించటమంటే తనలోని శుద్ధచైతన్యానికి (ఆత్మకు) విశ్వచైతన్యానికి (పరమాత్మకు) భేదం లేదని గుర్తించటం. అదే ఆపరోక్షానుభూతి. అదే యోగసాధనకు పరాకాష్ఠ.

*మం॥ ఏ షోహ దేవః ప్రదిశోను సర్వాః*
*పూర్వోహ జాతః స ఉ గర్భే అంతః ।*
*స ఏవ జాతః స జనిష్యమాణః*
*ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సర్వతో ముఖః॥* **16**

ఈ దివ్యత్వమే (విశ్వచైతన్యమే) తూర్పు మొదలైన అన్ని దిక్కులందు. ఈ శాన్యం మొదలైన అన్ని ఉపదిక్కులందు (మూలలందు) సర్వత్రా వ్యాపించి ఉన్నది. అతడే మొదట జన్మించినవాడు (హిరణ్యగర్భుడు) ఈనాడు కూడా గర్భంలో ఉన్నవాడు అతడే! ఇదివరకు పుట్టిన వాడూ, ఇకముందు పుట్టబోయేవాడూ కూడా అతడే! అన్ని ప్రాణులలోను అంతర్యామిగా, అన్ని దిక్కులలోను సర్వవ్యాపిగా, సర్వతో ముఖుడుగా ఉన్నవాడు అతడే !

***మం ॥ యోదేవో అగ్నౌ యో అప్సు***
***యో విశ్వం భువన మావివేశ ।***
***య ఓషధీషు యోవనస్పతిషు***
***తస్మై దేవాయ నమో నమః ॥*** **17**

ఏ దేవుడు అగ్నిలోను జలంలోను, సమస్త విశ్వంలోను వ్యాప్తమై ఉన్నాడో, ఏ దేవుడు ధాన్యంలో, ఓషధులలో, చెట్లు చేమలలో వ్యాపించి ఉన్నాడో, అటువంటి ఆ విశ్వాత్మకు, పరమాత్మకు అనేక నమస్కారములు.

ఇంతవరకు ఈ అధ్యాయంలో బ్రహ్మసాక్షాత్కారానికి కావలసిన సాధన సంపత్తిని గూర్చి. యమ నియమాదులను గూర్చి, ధ్యానయోగ మహత్వాన్ని గూర్చి, ధ్యానయోగ పద్ధతిని గూర్చి వివరించారు.

# తృతీయాధ్యాయము

*మం॥ య ఏకో జాలవానీశత ఈశనీభిః*
*సర్వాంల్లోకానీశత ఈశనీభిః ।*
*య ఏవైక ఉద్భవే సంభవే చ*
*య ఏతద్ విదురమృతా స్తే భవంతి ॥* **1**

ఆ పరమసత్త (పరబ్రహ్మం) సృష్టి సమయంలోనూ, ప్రళయ సమయంలోనూ కూడా ఒక్కటే ! అది అద్వితీయమైనది. ఆ ఈశ్వరీయ శక్తియే లోకాలన్నింటిమీద శాసనం వహిస్తోంది. ఆ అద్వితీయమైన పరమసత్తయే తన మాయాశక్తిచేత ఈ లోకాలన్నింటిని తన అధీనంలో ఉంచుకుంటోంది. ఈ మహత్తరమైన శక్తులచేతనే ఆ పరమసత్త ఈ లోకాలన్నింటిని నియమిస్తూ రక్షిస్తూ ఉన్నట్లు మనకు గోచరిస్తుంది. ఆ పరమ శక్తియొక్క మాయ అజ్ఞానుల్ని తన మాయావాగురలో కప్పి ఉంచుతుంది. జ్ఞానులైనవారు ఆ పరబ్రహ్మను ఆత్మభావంతో (ఆ పరమసత్తయే నేను అనే భావంతో) సాక్షాత్కరించుకుంటారు కాబట్టి వారు అన్ని బంధనాల నుండి ముక్తులౌతారు. శాశించేవాడు, శాసింపబడే ఈ సృష్టికూడా పరమాత్మయే అని అర్థం చేసుకోవాలి.

*మం॥ ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః*
*య ఇమాన్లోకానీశత ఈశనీభిః*
*ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సంచుకోచాంతకాలే*
*సంసృజ్య విశ్వా భువనాని గోపాః ॥* **2**

ఇతరమైన వాటి అపేక్ష, సహాయం లేకుండా అద్వితీయుడై తన శక్తులచేతనే బ్రహ్మవిష్ణువు మొదలైన రూపాల్లో ఈ విశ్వాన్ని రక్షించి పాలిస్తూ ఉండే ఆ పరమాత్మ (మూలంలో రుద్రుడన్నారు) ఒక్కడే ! అతడు జీవులన్నింటిలోనూ ఉన్నాడు. సమస్త భువనాలను సృష్టించి, పోషించి, ప్రళయకాలంలో మళ్ళీ తనలోకే ఆకర్షించుకుంటున్నాడు.

ఈ మంత్రంలో రుద్రుడనే శబ్దం పరమాత్మపరంగా వాడిందే గాని సుగుణరూపంలో అరాధింపబడే త్రిమూర్తులలో ఒకడైన శివుడు అని అర్థంకాదు. ఈ రుద్రుడు అనే శబ్దానికి 1) భక్తుల పాపాలను, శోకాలను నాశనం చేసేవాడు, జ్ఞానాన్ని ఆనందాన్ని ఇచ్చేవాడు 2) పాపులను శిక్షించేవాడు అని అర్థాలు. ఇవన్నీ పరమాత్మ విభూతులుగా ఎంచి పరమాత్మపరంగానే అర్థం చెప్పుకోవాలి. ఈ ఉపనిషత్తులో సగుణ శంకరునికి పర్యాయ పదాలైన రుద్ర, ఈశానాది శబ్దాలు చాలాసార్లు వాడినారు. ఆ కారణం చేతనే ఈ ఉపనిషత్తుని శైవోపనిషత్తుల్లో చేర్చారేమో ! అంతేకాక రుద్రప్రశ్నలోని (నమకంలోని) కొన్ని మంత్రభాగాలు కూడా ఇందులో కనిపిస్తున్నాయి. అదికూడా కారణమై ఉండవచ్చు. ఏమైనా ఇది ఉపనిషత్తు కాబట్టి నిర్గుణ పరబ్రహ్మగానే గ్రహించటం యుక్తం.

***మం॥ విశ్వతశ్చక్షు రుత విశ్వతో ముఖో***
***విశ్వతో బాహురుత విశ్వతస్పాత్ ।***
***సంబాహుభ్యాం ధమతి సంపత***
***త్రైర్ ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః ॥*** **3**

అద్వితీయుడైన ఆ పరమాత్మయే ఈ భూలోకాన్ని, ద్యులోకాన్నీ, (భూమ్యా కాశాదులను) సృష్టిస్తూ వారి వారి సంస్కారాలను అనుసరించి ధర్మా ధర్మ నిర్వహణకోసం మానవులకు రెండుచేతుల్ని పక్ష్యాదులకు రెక్కల్ని ప్రసాదించాడు. అంటే పూర్వ జన్మ కర్మ సంస్కారాల్ని బట్టి మనకు ఈ జన్మలు లభిస్తున్నాయి- మానవ పశు పక్ష్యాది జన్మలు. వాటికి తగిన కర్మలే (ధర్మాధర్మ కర్మలు) నిర్వర్తిసున్నాము. కాబట్టి ఈ సమస్త మానవ పశుపక్ష్యాదుల చేతులు, రెక్కలు, కండ్లు, ముఖాలు. పాదాలు. అన్నీ ఆ భగవంతునివే ! కాబట్టే పరబ్రహ్మ, విశ్వచక్షువు, విశ్వముఖుడు, విశ్వతోబాహుడు. ఈ సృష్టిలో జరిగే సమస్త కర్మలకు ప్రేరణ యిచ్చి చేయించేది ఆయనయే!

***మం॥ యోదేవానాం ప్రభవశ్చోద్భవశ్చ***
***విశ్వాధిపో రుద్రో మహర్షిః ।***
***హిరణ్యగర్భం జనయామాస పూర్వం***
***సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥*** **4**

ఏ పరమాత్మ ఇంద్రాది దేవతలను సృష్టించి రక్షిస్తాడో (ఏ పరమాత్మ ఇంద్రియాలను సృష్టించి తానే వాటిలో ఉండి నడిపిస్తాడో) సమస్త విశ్వానికి అధిపతియై, సర్వజ్ఞుడై యున్నాడో, ఏ పరమాత్మ హిరణ్యగర్భుని (విశ్వాత్మను) ముందుగా సృష్టించాడో, ఏ పరమాత్మ (రుద్రుడు) శోకాన్ని, పాపాన్ని పోగొట్టి జ్ఞానాన్ని ఇవ్వటానికి సమర్థుడో, ఏ పరమాత్మ సమస్త కార్యజాతాన్ని పర్యవేక్షిస్తూ ఉంటాడో (మహర్షి) అటువంటి ఆ పరమాత్మ మాకు మంచి బుద్ధిని ప్రసాదించి పరమపదాన్ని పొందటానికి యోగ్యులను చేయుగాక.

***మం॥ యా తే రుద్ర శివా తమారఘోరాऽ పాపకాశినీ ।***

***తయా నస్తనువాశంతమయా గిరిశం తాబి చాకశీహి ॥*** **5**

ఓ రుద్రుడా ! నీ రూపం, కల్యాణ ప్రదమైనది. శాంతిమైనది. తలచినంత మాత్రం చేతనే పాపాల్ని పోగొట్టి పుణ్యాల్ని ఇవ్వటానికి సమర్థమైనది. అన్ని భయాలను పోగొట్టేది. వేదాలలో ఉండి, వాటిని ప్రకాశింపచేస్తూ అన్నిటిని అనుగ్రహించేవాడవు నీవు ! అట్టి అనుగ్రహ పూర్ణమైన నీరూపంతో మావైపు చూచి, మమ్ము శ్రేయోమార్గంలో నడిచేటట్లు అనుగ్రహించు !

(ఇవి రుద్ర ప్రశ్నలో (నమకంలో) కనిపించే మంత్రభాగాలు.)

***మం॥ యా మిషుం గిరిశస్త హస్తే విభిర్ష్యస్తవే ।***

***శివాం గిరిత్రం తాం కురు మా హిగ్ం సీః పురుషంజగత్ ॥*** **6**

వేదాల్లో ఉండే సత్యాన్ని ప్రకాశింప చేసే ఓ రుద్రుడా ! (గిరిశంత) నీవు జీవులపైకి ఎదలటానికి సిద్ధంగా పట్టుకొని ఉన్న బాణాన్ని (ప్రణవాన్ని) శుభకరం చేసి మాకు అనుగ్రహించు. సకల వేదసారం, తారకము, మోక్షప్రదము అయిన ఆ ప్రణవాన్ని మాకు అనుగ్రహించు. ఓపర్వత రక్షకుడా! ఈ సృష్టిలో ఎవ్వరికి ఏ విధమైన హింస జరుగకుండగాక! ఈ విశ్వమంతా పరమాత్ముని దివ్య మంగళ స్వరూపం కాబట్టి ఈ విశ్వంలో ఎవరికి, ఎట్టి హాని జరుగకుండుగాక అని ప్రార్థన.

***మం॥ తతః పరం బ్రహ్మ పరం బృహంతం యథా***

***ని కాయం సర్వభూ తేషు గూఢమ్ ।***

*విశ్వస్యైకం పరివేష్టి తార మీశం తం*

*జ్ఞాత్వాఽ మృతా భవంతి ॥* **7**

ఈ అనంతమైన పరబ్రహ్మము సగుణబ్రహ్మ కంటె (విరాట్ పురుషుని కంటె హిరణ్యగర్భుని కంటె) ఉత్కృష్టమైనది. ఆ నిర్గుణ పరబ్రహ్మమే ఈ విశ్వంలో ఆయా శరీరాలకు తగినట్లుగా దాగి ఉంది. ఈ పరబ్రహ్మమే ఈ విశ్వాన్ని ఉపసంహరిస్తుంది. ఆ పరబ్రహ్మం విశ్వమంతటా వ్యాప్తమై ఉంది. ఇది తెలుసుకొని పరమాత్మను సాక్షాత్కరించుకొని ముముక్షువులు అమరులౌతారు.

*మం॥ వేదాహ మేతం పురుషం మహాంత*

*మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।*

*త మేవ విదిత్వాఽ తి మృత్యుమేతి*

*నాన్యః పంథా విద్యతేఽ యనాయ ॥* **8**

అజ్ఞానాంధకారానికి ఆవల అనంత ప్రకాశ స్వరూపుడైన పరమాత్మను నేను (శ్వేతాశ్వతర మహర్షి) సాక్షాత్కరించుకున్నాను. ఆ పరమాత్మను తెలుసుకొన్నవాడు మాత్రమే మృత్యువునకు అతీడుడౌతాడు. చావు పట్టుకలనే ఈ చక్ర భ్రమణం నుండి తప్పించుకునేందుకు ఇంతకు మించి వేరే మార్గం లేదు.

*మం॥ యస్మాత్పరం నాపరమస్తి కించిత్*

*యస్మాన్నాణీయో న జ్యాయోఽ స్తి కశ్చిత్ ।*

*వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక*

*స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం ॥* **9**

ఆ పరబ్రహ్మాన్ని మించిన తత్త్వం మరొకటి లేదు. అంతకంటె సూక్ష్మమైనదిగాని, పెద్దదిగాని గొప్పదిగాని ఏదీ లేదు. ఆ అద్వితీయమైన పరమాత్మయే, తన ప్రకాశంలోనే, తన ద్విమైన మహిమవల్ల వృక్షం లాగా అచంలంగా ఉంది. అ పరమ పురుషుని చేతనే ఈ విశ్వమంతా వ్యాప్తమై ఉంది.

*మం॥ తతో యదుత్తర తరం*

*తదరూప మనామయమ్ ।*

*య ఏతద్విదురమృతాస్తే భవంతి*

*అథేతరే దుఃఖ మేవా పియంతి ॥* **10**

ఆ పరమసత్త దేశకాల నిమిత్తాలకు అతీతమైంది. కాబట్టి, కార్య కారణభావం లేనిది కాబట్టి, కారణబ్రహ్మము కంటె కూడా శ్రేష్ఠతరమైనది. దానికి (పరమసత్తకు) రూపం లేదు. దుఃఖం లేదు. త్రివిధములైన తాపాలు లేవు. ఈ పరమ సత్యాన్ని తెలుసుకున్నవారు అమరులౌతారు. ఈ సత్యాన్ని తెలుసుకోలేనివారు దుఃఖాన్ని అనుభవించక తప్పదు.

*మం॥ సర్వానన శిరోగ్రీవః సర్వభూత గుహాశయః*

*సర్వవ్యాపీ స భగవాం స్తస్మాత్ సర్వగతః శివః ॥* **11**

ఆ నిర్గుణ పరబ్రహ్మం అన్నిటికి అతీతమైనది. కాబట్టి అతడు అంతట వ్యాపించి ఉన్నాడు. అన్నిటియందు ఉన్నాడు. మంగళప్రదుడై ఉన్నాడు. అంటే పరమాత్మ అన్నివైపుల ముఖములు. మస్తకములు, మెడలు, కలిగి అన్ని జీవుల హృదయాలలోను వ్యాపించి ఉన్నాడు. అందుచేత సర్వవ్యాపి. భగవంతుడు అన్నిటిలోనూ ఉన్నాడని, అన్నింటికి అతీతమై ఉన్నాడనే పరమ సత్యాన్ని ఈ మంత్రం చెపుతోంది.

*మం॥ మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః ।*

*సునిర్మలామిమాం ప్రాప్తి మీశానో జ్యోతిరవ్యయః ॥* **12**

ఈ పరమసత్తయే (పురుషుడే) నిజంగా గొప్పవాడు. ప్రభువు సమస్తానికి నియామకుడు, స్వయంజ్యోతి స్వరూపుడు; శరీరము, బ్రహ్మాండము అనే పురాల్లో ఉండేవాడు. అత్యంత నిర్మలమైనట్టి ఆత్మస్థితి రూపమైన ముక్తిని అందుకునేటట్లు చేయటానికిగాను సమస్త జీవుల అంతఃకరణాన్ని ప్రేరేపించేవాడు ఆ పరమసత్తయే !

*మం॥ అంగుష్ఠ మాత్రః పురుషో న్తరాత్మా*

*సదాజనానాం హృదయే సన్నివిష్టః ।*

***హృదా మనీషా మనసాభిక్తప్తో ।***

***య ఏత ద్విదురమృతా స్తే భవంతి ॥*** **13**

హృదయంచేత, ఊహచేత ఇచ్ఛాశక్తులచేత, పరిమితమై తన అభివ్యక్తికి స్థానమైనట్టి హృదయాకాశంలో ఈ అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ఉంటాడు. ఈ విషయాన్ని తెలుసుకున్నవారు అమరు లౌతారు. అంగుష్ఠ మాత్రుడు అంటే బొటనవ్రేలి పరిమాణం కలవాడు. ఈ పరిమాణం ఆత్మది అనుకోరాదు. ఆత్మకు సాధనంగా ఉండే ఆత్మతో కూడి ఉన్న హృదయాన్నిగా భావించుకోవాలి. అంటే అనంతమైన పరమాత్మ తన అభివ్యక్తికోసం ఇంత చిన్న పరిమాణంలోకి మారుతున్నట్లు కనిపిస్తున్నది.

ఈ మంత్రంలోని మొదటి రెండు పాదాలు కఠోపనిషత్తు 2– 3(17) మంత్రంలో కూడా కనిపిస్తున్నాయి.

***మం॥ సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।***

***సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥*** **14**

ఆ పరమ పురుషుడు వేయితలలు కలవాడు. వేయి కన్నులు కలవాడు. వేయి పాదాలు కలవాడు. అతడు పరిపూర్ణుడు. ఈ విశ్వాన్ని అన్ని వైపులనుండి ఆక్రమించి, అంతట వ్యాప్తమై ఉన్నాడు. అనంతమైన తన రూపంతో ప్రపంచానికి బయటకడా వ్యాప్తమై ఉన్నాడు. నాభికి పది అంగుళాల పైన హృదయం ఉన్నది. అంతగొప్ప విశ్వరూపం కలవాడైనా ఈ చిన్న హృదయంలో అంతర్యామిగా ఉంటాడు. అట్లాగే విశ్వానికి బయట పదివ్రేళ్ళ దూరం వరకు ఈ విశ్వాన్ని అతిశయించి (మించి) ఉన్నాడు. అంటే విశ్వానికంతకు అతీతుడై ఉన్నాడని భావం.

ఈ మంత్రం దీని తరువాతి మంత్రం పురుష సూక్తంలో కూడా ఉన్నాయి.

***మం॥ పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్ ।***

***ఉతామృతత్వ స్యే శానః యదన్నే నాతిరోహతి ॥*** **15**

పూర్వం ఉండినది, ఒక ముందు ఉండబోయేది, ఇప్పుడున్నది (భూత భవిష్య ద్వర్తమానాలు) అన్నీ అతడే ! ఈ అన్నమయకోశరూపంలో వృద్ధిపొందేది ఆ పరబ్రహ్మమే

! అతడే అమరత్వానికి (మోక్షానికి) కూడా ప్రభువు. అన్నమయ కోశరూపంలో వృద్ధి పొందేది ఈ విశ్వం. పరబ్రహ్మ తనయొక్క సత్య జ్ఞాన అనంతరూపంతో కాక సగుణరూపంలో (విశ్వ రూపంలో) కన్పట్టినా ఆ పరబ్రహ్మమే మోక్షానికి స్వామి.

***మం॥ సర్వతః పాణి పాదం తత్ సర్వతోఽ క్షి శిరోముఖమ్***

***సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥*** **16**

పరమాత్మయొక్క సర్వరూపకత్వాన్ని చెపుతున్నారు. ఆ పరబ్రహ్మ అన్ని వైపులా, అంతటా చేతులు కాళ్ళూ కలవాడు. అంతటా కండ్లు, తలలు ముఖాలు చెవులు కలవాడు. ఆ పరమ అసత్త, విశ్వమంతా వ్యాపించి, అన్నింటిలోను వ్యాప్తమై ఉన్నది.

***మం॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।***

***సర్వస్య ప్రభుమీశానం సర్వస్య శరణం సుహృత్ ॥*** **17**

ఆ పరబ్రహ్మ ఏ ఇంద్రియాలు లేనివాడు– నిర్గుణుడు అయినప్పటికి అన్ని యింద్రియాల యొక్క కర్మలను, వాటి విషయాలను ప్రకాశింప చేస్తూ ఉంటాడు (వ్యక్తం చేస్తూ ఉంటాడు.) దేహంలో ఉంటూ కూడా అతడు దేహానికి కట్టుబడి ఉండేవాడు కాడు. అతడు అన్నిటికి ప్రభువు. అంతటికి నియామకుడు. అన్నిటికి ఆశ్రయమైనవాడు. అన్నిటికి కారణమైనవాడు. అన్నిటికి శరణ్యుడు. అన్నిటికి స్నేహితుడు; అతని జ్ఞానులు తెలుసుకుంటారు.

***మం॥ నవద్వా రే పురేదేహీ హంసో లేలాయతే బహిః ।***

***వశీసర్వస్య లోకస్య స్థావరస్య చరస్యచ ॥*** **18**

ఈ జడ చేతనమైన జగత్తు కంతకు ప్రభువు, హంస స్వరూపుడైన పరమాత్మయే జీవాత్మరూపంలో తొమ్మిది ద్వారాలు కల ఈ పురంలో (శరీరంలో) ఉంటూ బాహ్య ప్రపంచంలో క్రీడిస్తున్నాడు. అంటే బాహ్య విషయాల్ని గ్రహించటానికి ప్రయత్నిస్తున్నాడు. హంస నీటిలో క్రీడిస్తున్నా ఆ నీటి తడి దానికి అంటదు. అట్లాగే ఆత్మ ఈ బాహ్య జగత్తులో విహరిస్తునాన, ప్రాపంచిక విషయాలు దానికి అంటవు. (ఆత్మను, పరమాత్మను హంసగా ఉపమించటం సంప్రదాయం. క్షీరనీర వివేకానికి హంసను చెపుతారు. అట్లాగే "సో హం",

(సః అహం) అనే తత్త్వ వాక్యాన్ని జపిస్తే లభ్యమయ్యేది కూడా 'హంస' రూపం. అట్లాగే 'తత్ త్వమ్' అనే వేదాంత వాక్యం కూడా 'తత్త్వం' అయివేదాంత తత్త్వానికి రూఢమైనది.)

***మం॥ అపాణి పాదో జవనో గ్రహీతా***
***పశ్యత్య చక్షుః స శృణోత్యకర్ణః।***
***సవేత్తి వేద్యం న చ తస్యాస్తివేత్తా***
***తమాహురగ్ర్యం పురుషం మహాంతం॥*** **19**

అతడు చేతులు, కాళ్ళు, లేకపోయినా మిక్కిలి వేగంగా పోగలడు. అన్నిటిని పట్టుకోగలడు. కండ్లు లేకపోయినా అన్నిటిని చూడగలడు. చెవులు లేకపోయినా అన్ని వినగలడు. తెలుకోదగినవన్నీ అతనికి తెలుసు. కాని, అతనిని తెలుసుకున్నవారు మాత్రం లేరు. ఆ పరమాత్మనే యతీశ్వరులు అన్నిటికి ఆదికారణమని, పూర్ణుడని, అనంతుడని, అంటారు.

***మం॥ అణోరణీయాన్ మహతో మహీయా***
***నాత్మా గుహాయాం నిహితోఽ స్యజంతోః।***
***తమ క్రతుః పశ్యతి వీతశోకో***
***ధాతుః ప్రసాదాన్మహిమాన మీశమ్॥*** **20**

ఆత్మ అనేది సూక్ష్మమైన అణువుకంటె సూక్ష్మమైనది. గొప్పదాని కంటె మరింత మహత్తరమైనది. ఇది ప్రాణులయొక్క అంతరాత్మ (హృదయము) అనే గుహలో ఆత్మరూపంలో ఉన్నది. విషయ భోగాలను ఆశించనివాడు, మహిమాన్వితుడైనవాడు, భగవంతుని కృపకు పాత్రుడైన వాడు, స్వచ్ఛమైన ఇంద్రియాలు కలవాడు, దుఃఖం నుండి విముక్తుడై ఆత్మను సాక్షాత్కరించుకుంటాడు.

ఈ మంత్రం కూడా యధాతథంగా కఠోపనిషత్తు1 - 2(20) లో కనిపిస్తుంది.

***మం॥ వేదాహమేత మజరం పురాణం సర్వా***
***త్మానం సర్వగతం, విభుత్వాత్।***
***జన్మనిరోధం, ప్రవదంతియస్య***
***బ్రహ్మవాదినో హి ప్రవదంతి నిత్యమ్॥*** **21**

బ్రహ్మవేత్తలైనవారు పరమాత్మను జన్మరహితుడని, వృద్ధాప్యం లేనివాడని, పురాతనుడని, శాశ్వతుడని ప్రశంసిస్తూ ఉంటారు. అక్షయుడు, ఆదిరహితుడు, అన్నిటియందు వ్యాపించి యున్నందున సర్వవ్యాపి అని కీర్తిస్తూ ఉంటారు. అటువంటి పరమాత్మను నేను తెలుసుకున్నాను.

**సింహావలోకనం :** వెనుకటి అధ్యాయంలో యోగ సాధకునకు భగవంతుని అనుగ్రహం కూడా ఉండాలని చెప్పారు. ఈ అధ్యాయంలో భగవత్కృపకోసం పరమాత్మను ప్రార్థించటం చెప్పారు. అందుచేత భక్తి మార్గానికి కూడా అవకాశం యిచ్చినట్లు కనిపిస్తుంది.

# చతుర్థాధ్యాయము

*మం॥ య ఏకోఽ వర్ణో బహుధా శక్తి యోగా ద్వ*
*ర్ణా ననేకాన్ నిహితార్థో దధాతి ।*
*వి చైతి చాంతే విశ్వమాదౌ చ దేవః*
*స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥* **1**

సృష్టికి ఆరంభంలో అద్వితీయుడై, జాతి, వర్ణము మొదలైనవి ఏవీ లేనివాడై, ఎవరి సహాయమూ లేకుండా, తన శక్తితో, స్వీయ సహాయంతో ఏ విధమైన స్వార్థము లేకుండా, ఎవ్వరూ తెలుసుకోలేని ఉద్దేశాలతో ఈ సృష్టిని సృష్టిస్తూ ఆ పరమాత్మ అనేక రూపాలుగా వ్యక్తమౌతున్నాడు. ప్రళయకాలంలో, ఈ సృష్టించిన దానినంతను తనలోనికే లీనం చేసుకుంటున్నాడు. అటువంటి ప్రకాశస్వరూపుడు, విజ్ఞానైక వేద్యుడు అయిన పరమాత్మ మాకు మంచి బుద్ధిని ప్రసాదించుగాక !

*మం॥ త దేవాగ్నిస్త దాదిత్యస్త ద్వాయుస్తదు చంద్రమాః ।*
*త దేవ శుక్రం తద్ బ్రహ్మ త దాప స్తత్ ప్రజాపతిః ॥* **2**

ఆ పరమాత్మయే అగ్ని, ఆ పరమాత్మయే సూర్యుడు, అతడే వాయువు; చంద్రుడు, ఆ పరమాత్మయే పవిత్రము, జ్యోతిస్సులతో నిండి ఆకాశము; అతడే హిరణ్యగర్భ స్వరూపుడు, జలము, విరాట్ స్వరూపుడు కూడా ఆ పరమాత్మే, మనం దేవతలుగా భావించే వారంతా

కూడా ఆ పరమాత్మ స్వరూపాలే! తద్భిన్నమైనవి కావు. కాబట్టి, వేదాలు ఏకేశ్వరోపాసననే చెప్పినాయనే విషయం తెలుస్తోంది.

***మం॥ త్వం స్త్రీ త్వం పుమానసి***
***త్వం కుమార ఉతవా కుమారీ ।***
***త్వం జీర్ణో దండేన వంచసి త్వం***
***జాతో భవసి విశ్వతో ముఖః ॥*** **3**

పరమాత్మను మధ్యమ పురుషలో సంబోధిస్తూ అంటున్నాడు. నీవు స్త్రీవి. నీవు పురుషుడవు. (పరబ్రహ్మకు స్త్రీ పురుష భేదం లేదు) నీవు యువకుడవు. యువతివి. నీవు కఱ్ఱ సహాయంతో నడిచే వృద్ధుడవు (అవస్థా భేదం లేదు) నీవు ఉపాధుల రూపంతో పుట్టి విభిన్న రూపాలుగా కనిపిస్తావు. కాబట్టి అన్ని దిక్కులందు విశ్వతో ముఖుడవుగా కన్పిస్తున్నావు.

***మం॥ నీలః పతంగో హరితో లోహితాక్షః***
***తడిద్గర్భ ఋతవః సముద్రాః ।***
***అనాదిమత్ త్వం విభుత్వేన వర్తసే***
***యతో జాతాని భువనాని విశ్వా ॥*** **4**

నీలపు రంగులో ఉండే సీతాకోకచిలుకవు లేక భ్రమరానివి నీవే ! ఎఱ్ఱని కండ్లు, పచ్చరనిరంగు గల చిలుకవు నీవే! మేఘము, గ్రీష్మాది ఋతువులు, సముద్రాలు, నీవే! నీకు ఆది లేదు- అంతం లేదు. దేశకాలాలకు నీవు అతీతుడవు. నీ నుండే సమస్తలోకాలు పుట్టినాయి కాబట్టి నీవు ప్రభుడవై అంతటా గోచరిస్తున్నావు.

***మం॥అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం***
***బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః ।***
***అజో హ్యేకో జుషమాణోఽ ను శేతే***
***జహాత్యేనాం భుక్తభోగ మజోఽ న్యః ॥*** **5**

ఎరుపు తెలుపు నలుపు రంగులు గల ఒక స్త్రీ ఉన్నది. (సత్త్వరజస్తమో గుణాలతో కూడిన ప్రకృతియే ఆ స్త్రీ, తెలుపు సత్త్వగుణానికి, ఎరుపు రజోగుణానికి, నలుపు తమోగుణానికి

ప్రతీకలు. అట్లాగే కొందరు ఎరుపురంగు అగ్నికి, తెలుపురంగు నీటికి, నలుపురంగు భూమికి ప్రతీకలుగా చెపుతారు. ఎట్లా అయినా ఇవి ప్రకృతిని సూచిస్తూ ఉన్నాయి) ఈ ప్రకృతి అనే స్త్రీ తన లాగానే ఉండే అనేకమందిని (సత్వరజస్తమో గుణాలతో కూడిన వారిని) ఉత్పత్తి చేస్తుంది. ఆమెకు పుట్టుక లేదు– ప్రకృతి అనాదియైనది కాబట్టి. అటువంటి ఆ స్త్రీ యందు (ప్రకృతియందు) అనురక్తుడైనట్టి, జన్మ రహితుడైనట్టివాడు (జీవుడు) ఆమె ప్రక్కనే పరుండి అనుభవిస్తూ ఉండగా, వేరొకడు (ప్రకృతినుండి ముక్తుడైనవాడు– ఆత్మ) ఆ ప్రకృతిని అనుభవించటం ద్వారా లభించే సుఖాలు, దుఃఖానికి కారణాలని, అశాశ్వతములని తెలుసుకొని ఆ ప్రకృతిని వదలివేస్తున్నాడు. అంటే ప్రకృతిలో జన్మించిన జీవులు కొందరు అజ్ఞానులై ప్రకృతివశులై ఉంటారు.కొందరు ఈ ప్రాకృతిక సుఖాలకు అతీతులై ముక్తులౌతారు. అంటే జీవాత్మ ఈ ప్రపంచాన్ని అనుభవిస్తోంది. పరమాత్మ ఈ ప్రకృతిని విసర్జిస్తోంది. ఎంత చక్కటి పోలిక ! ఎంత చక్కటి కావ్య సౌందర్యం కనిపిస్తోంది !

***మం॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం***
***వృక్షం పరిషస్వ జా తే,***
***తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య***
***నశ్న న్నన్యో అభిచాకశీతి ॥ 6***

కలసి మెలసి ఉండేవి, అందమైన రెక్కలు గలవి, ఒకే పేరుగల రెండు పక్షులు ఒకే వృక్షం మీద ఉన్నాయి. అందులో ఒకటి (జీవాత్మ) అజ్ఞానంవల్ల ఆ వృక్షం మీద ఉన్న వివిధ రుచులు గల ఫలాలను (కర్మ ఫలాలను) ఆస్వాదిస్తోంది. రెండవ పక్షి (శుద్ధ, బుద్ధి, ముక్త స్వరూపుడైన పరమాత్మ) తానూ ఏమీ తినకుండా చూస్తూ ఉంది.

అద్వైత సిద్ధాంతం ప్రకారం జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు కాబట్టి ఈ రెంటిని విడదీయరాని మిత్రులుగాను, ఒకే పేరు కలవిగాను (ఆత్మ) చెప్పారు. ఈ శరీరాన్నే వృక్షంగా గ్రహించాలి. జీవుడు శరీరాన్ని ఆశ్రయించి ఉండటం మనకు అనుభవమే ! అట్లాగే సమస్త జీవుల శరీరాల్లోను అంతర్వర్తిగా ఉన్న ఆ పరమాత్మను కూడా శరీరాన్ని (విశ్వ శరీరాన్ని) ఆశ్రయించి ఉన్నట్లుగా చెప్పారు.

ఈ మంత్రంలోను, తరువాతి మంత్రంలోను జీవాత్మ పరమాత్మల స్వభావంలో ఉన్న విలక్షణమైన గుణాన్ని చెపుతున్నారు. ఈ మంత్రం యదాతథంగా ముండకోపనిషత్తు 3- 1(1) లో ఉన్నది.

***మం॥ సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ నీ***
***శయా శోచతి ముహ్యమానః***
***జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య***
***మహిమానమితి వీతశోకః ॥*** **7**

జీవాత్మ పరమాత్మలు ఒకే వృక్షం మీద ఉన్నప్పటికి, జీవుడు దేహాభిమానంలో మునిగిపోయిన వాడై మోహగ్రస్తుడై, తన నిజరూపాన్ని మరిచపోయి, దీనిభావంతో దుః ఖిస్తూ ఉంటాడు. అనేకమంది యోగుల చేత ఉపాసింపబడేటటు వంటి అశరీరుడైనట్టి పరమాత్మ యొక్క మహిమను గుర్తించి మానవుడు దుఃఖం నుండి విముక్తుడౌతాడు.

ఈ మంత్రం కూడా ముండకోపనిషత్తు 3- 1(2) లో యథా తథంగా ఉన్నది.

***మం॥ ఋచో అక్షరే పరమే వ్యోమన్***
***యస్మిన్దేవా అధి విశ్వే నిషేదుః***
***య స్తం న వేద కిమృచా కరిష్యతి***
***య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే ॥*** **8**

నాశరహితుడు, సర్వోన్నతుడు అయిన ఆ సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మము నందే వేదాలు సమస్త దేవతలు నివసిస్తున్నారు. అంటే అన్ని వేదాలు అందరు దేవతలు ఆ పరబ్రహ్మనే కీర్తిస్తున్నారు. ఈ విషయాన్ని తెలుసుకోలేనివాడు వేదాలు చదివి ఏమి ప్రయోజనం? ఆ దేవతలను పూజించి ఏమి ప్రయోజనం? ఆ పరమసత్తను తెలుసుకున్నవాడే తృప్తిని పొంది ధన్యుడౌతాడు. సచ్చిదానంద స్వరూపమైన ఆ పరమసత్త సాక్షాత్కారానికి ఉపయోగించని అధ్యయనం వ్యర్థమని తాత్పర్యం.

***మం॥ ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని***
***భూతం భవ్యం యచ్చ వేదా వదంతి,***

***అస్మా న్మాయీ సృజతే విశ్వమేత***

***త్త శ్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః ॥*** **9**

వేదాలు, దేవతలు, యజ్ఞాది కర్మలు, జ్యోతిష్టోమాది యాగాలు, చాంద్రాయణాది వ్రతాలు, భూత భవిష్య ద్వర్తమాన కాలాలు, ఇంకా మనం వేదాలుగా పరిగణించే వన్నింటిని (పురాణేతిహాసాలు మొ॥) ఈ సంపూర్ణ విశ్వాన్నంతటిని మాయకు అతీతుడైనట్టి మాయకు అధిపతియైనట్టి ఆ పరమాత్మయే సృష్టిస్తున్నాడు, ఈ విశ్వమంతా అతని శక్తివల్ల రచింపబడ్డదే! అయినప్పటికి తాను రచించిన ఈ సృష్టిలోనే మాయతో గూడి తానే స్వయంగా జీవభావంతో బద్ధుడై ఉంటాడు.

***మం॥ మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంచ మహేశ్వరం***

***తస్యావయన భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥*** **10**

ఈ జగత్కారణమైన ప్రకృతినే మాయ అని తెలుసుకో ! ఈ మాయకు అధీశ్వరుడైన మాయావి మహేశ్వరుడని (పరబ్రహ్మమని) తెలుసుకో ! ఈ కార్యకారణ సంఘాతంతో కల్పితమైన ఈ జగత్తు అంతా అతని అవయవ స్వరూపమని తెలుసుకో ! అంటే ఈ విశ్వంలో ఉన్న సమస్త జీవులు ఆ పరబ్రహ్మయొక్క అవయవాలవంటి వారని భావం.

(పురుషసూక్తం ఈ మంత్రార్థానికి చక్కని దృష్టాంతంగా ఉంటుంది)

***మం॥ యో యోనిం యోనిమధితిష్ఠ త్యేకో***

***యస్మిన్నిదం సం చ విచైతి సర్వమ్ ।***

***తమీశానం వరదం దేవమీడ్యం***

***నిచాయ్యేమాం శాంతి మత్యంత మేతి ॥*** **11**

ఆద్వితీయమైన నిరుపాధిక పరబ్రహ్మమే, మూలప్రకృతికి, ఆకాశాది ఇతర ప్రకృతులకు కూడా అధిష్టాతయైనవాడు. అతడే ప్రకృతి యొక్క అనేక రూపాలను పర్యవేక్షిస్తాడు. అతని యందే ఈ కనపడేటటువంటి అనేక రూపాలలో భాసిస్తున్న ఈ జగత్తు అంతా చక్కగా లీనమై పోతుంది. మళ్ళీ సమయం వ్చినపుడు వివిధ రూపాలు ధరిస్తుంది. అటువంటి ఆ స్వయంజ్యోతి, సర్వదాత, ఆరాధ్యుడు, అన్నిటిని శాసించే వాడు, స్తుతింపదగినవాడు అయిన

పరతత్త్వాన్ని ఆత్మ భావంతో సాక్షాత్కరించుకొన్న సాధకుడు అనంతమైన పరమశాంతిని పొందుతాడు.

*మం॥ యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ*
*విశ్వాధిపో రుద్రో మహర్షిః ।*
*హిరణ్యగర్భం పశ్యతజాయమానం*
*స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు.* **12**

ఆ పరమాత్మ బ్రహ్మాది దేవతలను (ఇంద్రియాలను) సృష్టించి రక్షిస్తూ ఉంటాడో, ఏ పరమాత్మ ఈ సమస్త విభూతికి కారణుడు, పోషకుడు అయి ఉన్నాడో, ఏ పరమాత్మ భక్తుల శోకాలను, పాపలను నిర్మూలించి ఆనందాన్ని అనుగ్రహిస్తాడో, నియమ భంగం చేసే పాపులను శిక్షిస్తాడో, ఏ పరమాత్మ విశ్వాత్మమైన హిరణ్యగర్భుని సైతం తనలో నుండి ఆవిర్భవించటం చూచాడో అటువంటి పరమాత్మ మాకు మంచి బుద్ధిని ప్రసాదించుగాక!

*మం॥ యో దేవానామధిపో యస్మింల్లోకా అధిశ్రితాః ।*
*య ఈశే అస్య ద్విపద చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమః ॥* **13**

బ్రహ్మాది దేవతలకు కూడా అధిపతియైనవాడూ, సమస్తలోకాలకు ఆశ్రయుడైనట్టి వాడు, మానవులు, పశువులను కూడా పాలించే వాడూ అయిన,ఆనందస్వరూపుడయిన పరమాత్మను చరు పురోడాశాదులతో సేవిద్దాము– ఆహుతుల నిచ్చి పూజిద్దాము.

మనం పరమాత్మను ఎన్నో పేర్లతో పిలుస్తున్నాము. ఎన్నో విధాలుగా అర్చన చేస్తున్నాము. ఎన్ని పేర్లతో పిలిచినా ఆ పరమాత్మను పిలిచనట్లే, ఎన్ని విధాలుగా అర్చన చేసినా అతనిని అర్చించినట్లే! అయితే మానవులకే కాదు, పశు పక్ష్యాదులకు కూడా అతడే ఆరాధ్యుడు. ఈ మంత్రంలో కర్మకాండలను అంగీకరించినట్లు,బోధించినట్లు భావించరాదు.

*మం॥ సూక్ష్మాతి సూక్ష్మం కలిలస్య మధ్యే*
*విశ్వస్య స్రష్టార మనేక రూపం ।*
*విశ్వస్యైకం పరివేష్టితారం*
*జ్ఞాత్వా శివం శాంతి మత్యంతమేతి ॥* **14**

ఈ పరమాత్మ మిక్కిలి సూక్ష్మమైనవాడు. రూపంలేని దాని మధ్య రూపంతో కూడిన ఈ విశ్వాన్ని సృష్టించేవాడు. అంటే తనకు రూపం లేదు. కాని వివిధ రూపాలతో కూడిన ఈ విశ్వ సృష్టికి కారణమైనవాడు. తాను సూక్ష్ముడు. కాని బృహత్తరమైన విశ్వానికి సృష్టికర్త ! ఈ విశ్వాన్నంతను ఆవరించి ఉంటాడు. ఈ సృష్టిలోని జీవులన్నింటికి కర్మఫల ప్రధానం చేసేవాడు; కల్యాణ స్వరూపుడు, ఆనందమయుడు అయిన ఆ పరబ్రహ్మను సాక్షాత్కరించుకొని జీవుడు అంతులేని శాంతిని పొందుతాడు.

***మం॥ స ఏవ కాలే భువనస్య గోప్తా***
***విశ్వాధిపః సర్వభూతేషు గూఢః।***
***యస్మిన్ యుక్తా బ్రహ్మర్ష యో దేవతాశ్చ***
***త మేవం జ్ఞాత్వా మృత్యుపాశాం శ్చినత్తి॥*** **15**

ఆ పరమేశ్వరుడే ఈ భువనాలన్నింటికి ఎల్లవేళల రక్షకుడు. సమస్త లోకాలకు అతడే ప్రభువు. అన్ని భూతములయందు దాగి ఉండి ఈ విశ్వానికి సాక్షీభూతుడై ఉన్నాడు. ఈ పరమాత్మయందే దేవతలు, మహర్షులు అద్వైత స్థితిలో లీనమై ఉన్నారు. 'నేనే బ్రహ్మను' అనే భావంతో, ఈ సత్యాన్ని తెలుసుకొన్నవారు అవిద్యను, కామ్య కర్మలవల్ల ఏర్పడిన బంధాలను త్రెంచుకో గలుగుతారు.

మనం ఏ మహర్షిని, దేవతను పూజించినా ఆ పరమాత్మను పూజించినట్లే ! వారంతా ఆ పరమాత్మలో లీనమై భేదభావానికి తావులేనివారే కాబట్టి ! ఈ విషయాన్ని గ్రహించగలవాడు "అహం బ్రహ్మాస్మి– నేనే బ్రహ్మను" అనే స్థితిని కూడా పొందుతాడు. అంటే, బ్రహ్మ సాక్షాత్కారానికి అర్హుడు అవుతాడు. కాబట్టి మృత్యుపాశాలను త్రెంచుకో గలుగుతాడు.

***మం॥ ఘృతాత్పరం మండమివాతి సూక్ష్మం***
***జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢం।***
***విశ్వస్యైకం పరివేష్టితారం జ్ఞాత్వా***
***దేవం ముచ్యతే సర్వ పాశైః॥*** **16**

నేతిపై తేలి ఉండే సూక్ష్మాంశమైన సారంలాగా, అత్యంత సూక్ష్మ రూపంలో అన్ని జీవులలోను అంతర్యామిగా ఉన్నట్టి, ఆనంద స్వరూపుడైనట్టి, ఈ విశ్వానికి భోగ ప్రదాతయైనట్టి, ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొని పురుషుడు సమస్త బంధనాల నుండి విముక్తు డౌతాడు.

పాలలో ఉన్న సారం వెన్న. ఆ వెన్నలోని సారం నెయ్యి. ఆ నేతిలో కూడా అణురూపంలో సూక్ష్మంగా ఉండే సారం నూకలలాగా, నేతిపైన కట్టే తెట్టులాగా కనిపిస్తుంది. వెన్న నెయ్యి ఆ నేతిలో ఉండే సారవంతమైన పదార్థం ఇవన్నీ సూక్ష్మరూపంలో పాలలో అంతటా వ్యాపించి ఉన్నట్లే, ఈ విశ్వమంతటా పరమాత్మ వ్యాప్తమై ఉన్నాడని భావం.

***మం॥ ఏష దేవో విశ్వకర్మా మహాత్మా***
***సదా జనానాం హృదయే సన్నివిష్టః।***
***హృదా మనీషా మనసాభిక్లుప్తో***
***య ఏతద్విదు రమృతాస్తే భవంతి ॥ 17***

పరమాత్మయే ఈ సృష్టిరూపమైన కార్యానికి కర్త– అంటే సమస్త విశ్వాన్ని సృష్టించినవాడు. అంతటా వ్యాపించి ఉన్నవాడు. దివ్యుడు. అన్ని ప్రాణుల హృదయాల్లోను (నీరు మొదలైన వాటిలో సూర్యుడు ప్రతిబింబిస్తున్నట్లు) ఉన్నవాడు. ఉపదేశం ద్వారా, వివేకం ద్వారా, జ్ఞానం ద్వారా మాత్రమే సాక్షాత్కారానికి సాధ్యుడు. అంటే హృదయం, మనస్సు, బుద్ధి వీటిచేత పరిమితుడై జీవుల హృదయాల్లో ఉంటాడు. ఆ పరమాత్మను సాక్షాత్కరించుకోవటం ఎట్లా? నేతి= న ఇతి= ఇది కాదు. ఇది కాదు అనే దృశ్య విషయ నిషేధ రూపమైన ఉపదేశం ద్వారా, అనాత్మ వివేకం (ఏది ఆత్మకాదో తెలుసుకోవటం) బుద్ధికి కలగాలి. ఆ పిమ్మట ఏకత్వ జ్ఞానం కలగాలి– అంటే ఆత్మ పరమాత్మ ఒకటే అనే భావం కలగాలి. ఈ సత్యాన్ని తెలుసుకున్నవాడు అమరుడౌతాడు. (ఈ సృష్టిలో మన ఇంద్రియాలకు, మనస్సుకు, బుద్ధికి గోచరించే ప్రతి వస్తువును, ప్రతి విషయాన్ని ఇది బ్రహ్మమేనా? సత్య, జ్ఞా, ఆనంతత్వ లక్షణాలు గల బ్రహ్మమేనా? అని ప్రశ్నించుకుంటూంటే ప్రతిదానికి ఇది కాదు. ఇది కాదు, అనే సమాధానం వస్తుంది. అంటే ఇది ఆత్మకాదు అనే ఆనాత్మ వివేకం కలుగుతుంది. చివరకు ఏది ఆత్మ అవునో అది మిగులుతుంది. అంటే

ఆత్మ వివేకం కలుగుతుంది. తానే (ఆత్మయే) బ్రహ్మమనే విషయం తెలుస్తుంది. ఇది కాదు అని విమర్శించుకుంటూ పోగా చివరకు తనవద్దకే వస్తాడు– బయలుదేరిన చోటుకే వచ్చినట్లు అన్నిటియందు అనాత్మజ్ఞానం, తనయందు ఆత్మజ్ఞానం కలుగుతుంది. అదే ఆత్మ వివేకం.

***మం॥ యదాఽ తమస్తన్న దివా న రాత్రిః***
***నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః,***
***తదక్షరం తత్ సవితు ర్వరేణ్యం***
***ప్రజ్ఞాచ తస్మాత్ ప్రసృతా పురాణీ ॥*** **18**

జ్ఞానం వల్ల ద్వైతభావం ఎట్లా పోతుందో ఈ మంత్రంలో విశదీకరిస్తున్నారు.

చీకటి అనేది లేకపోతే పగలు లేదు, రాత్రి లేదు. ఉన్నదేదో ఒకటే ఉంటుంది. అంటే పగలే ఉంటుంది. అట్లాగే అజ్ఞానం లేకపోతే సత్తు లేదు. అసత్తులేదు. సత్తు మాత్రమే ఉంటుంది. ఉన్నదేదో ఒకే ఒక్క శివతత్త్వం– శుభప్రదుడైనవాడు ఒక్కడే ఉంటాడు. అతడు అక్షరుడు (నాశరహితుడు). అతడే పూజనీయడు, అతనినుండే పురాతనమైన గురు పరంపర ద్వారా వస్తున్న, మహావాక్య జన్యమైన ప్రజ్ఞ వ్యాప్తమైనది. అంటే అతని ద్వారానే వేదాలనుండి మనకు లభ్యమయ్యే జ్ఞానం ఉద్భవించినది.

***మం॥ నైన మూర్ధ్వం న తిర్యంచం న మధ్యే పరిజగ్రభత్ ।***
***న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః ॥*** **19**

ఆ పరమాత్మ నిరంశుడు– అంశలు లేనివాడు. నిరవయవుడు– అవయవాలు లేనివాడు. అందుచేతనే అతనిని పై నుండిగాని, అడ్డంగాగాని మధ్యగా (ఏటవాలుగా) గాని ఎవరు పట్టుకోలేరు. అతని పేరే 'మహద్యశము'– గొప్ప కీర్తి, అతనితో సమానమైన వారు లేరు.

అంటే, పరమాత్మ దేశ కాల పాత్రలకు అతీతుడు. అతనిని పోల్చటానికి తగిన ఉపమానం ఏదీ లేదు.

***మం॥ న సంధృశే తిష్ఠతి రూపమస్య న***
***చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ।***

*హృదా హృదిస్థం మనసా య ఏవ*
*మేవం విదురమృతాస్తే భవంతి ॥* **20**

నిర్విశేషుడు, స్వయం ప్రకాశమానుడు అయిన ఆ పరమాత్మ యొక్క స్వరూపాన్ని మన ఇంద్రియాలు గ్రహించలేవు. అంటే కండ్లు మొదలైన ఇంద్రియాలతో అతనిని గుర్తించలేము. కన్నులతో ఎవరూ చూడలేరు. విశుద్ధమైన బుద్ధితో ఎవరు హృదయంలో ఉన్న పరమాత్మను గుర్తించ గలుగుతారో వారు అమరులౌతారు.

పరబ్రహ్మ ఇంద్రియాలకు అతీతుడు– మనస్సు, బుద్ధికి కూడా అతీతుడే! కాని, హృదయాన్ని, మనస్సును, బుద్ధిని కేంద్రీకరించినందువల్ల కలిగే ఏకాగ్రస్థితి (ఏకాగ్రమైన స్ఫురణశక్తి) వల్ల మాత్రమే ఆత్మానుభవం కలుగుతుంది అని భావం. బ్రహ్మ స్వరూపానికి ఉపమానం ఏదీలేదు.

*మం॥ అజాత ఇత్యేవం కశ్చిద్భీరుః ప్రపద్యతే।*
*రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యం॥* **21**

ఈ రెండు మంత్రాల్లోను పరమేశ్వరుని గూర్చిన స్తుతి ఉన్నది.

ఓ రుద్రుడా ! నీవు జన్మలేనివాడవు. కాబట్టి జనన మరణ భయ భీతుడైనవాడు నిన్ను ఆశ్రయిస్తాడు. ఇక్కడ రుద్రుడంటే సగుణ మూర్తిగా అర్థం చేసుకో కూడదు. మనావుడు పరమాత్మను శరణు వేడటానికి కారణం ఏమిటి?– మరణభయం ! పరమాత్మకు పుట్టుక లేదు కాబట్టి మరణం లేదు. అందుచేతనే మానవుడు మరణ భయంతో ఆ పరమాత్మను శరణు వేడుతున్నాడు. రుద్ర శబ్దం రౌద్రాకారాన్ని, దక్షిణం ముఖం అనే శబ్దం పరమేశ్వరుని దాక్షిణ్యభావాన్ని సూచిస్తాయి– పరమాత్మ అర్హుడైన వాడికి దాక్షిణ్య భావంతోను అనర్హుడైన వానికి రౌద్రాకారంతోను కనిపిస్తాడని భావం. 'నీవు ప్రసన్న రూపంతో సర్వదా నన్ను అనుగ్రహించు" అని ప్రార్థన.

*మం॥ మానస్తోకే తనయేమాన ఆయుషి*
*మానోగోషుమానో అశ్వేషు రిరిషః।*
*వీరాన్మానో రుద్ర భామితో*
*వధీర్హ విష్మంతః సదమిత్త్వా హవామహే॥* **22**

ఓ రుద్రుడా ! నీవు క్రుద్ధుడవై (కోపించి0 మా పుత్రులయొక్క, మనుమలయొక్క ఆయుర్దాయం విషయంలో హాని కలిగించకు. మా ఆవులు, గుఱ్ఱాలు మొదలైనవాటిని నాశం చేయకు. వీరులైన మా వారిని చంపవద్దు, మేము పురోడాశాది హవిష్యాన్నములతో (కామ క్రోధాదులు హోమ ద్రవ్యాలుకాగా) నిన్ను ఆహ్వానిస్తాము. భగవత్సాక్షాత్కారం కోసం సమస్తాన్ని ధైర్య సాహసాలతో త్యజించి ముముక్షువులై ముందుకు సాగే వారంతా వీరులే! వారిని రక్షించమని ప్రార్థన.

ఈ చివరి రెండు మంత్రాలు సార్వజనీనము, సర్వకాలీనము, సర్వదేశీయము నైన భగవత్ప్రార్థనలు.

# పంచమాధ్యాయము

***మం॥ ద్వే అక్షరే బ్రహ్మపరే త్వనంతే***
***విద్యా విద్యే నిహితే యత్ర గూఢే।***
***క్షరం త్వవిద్యా హ్యమృతం తు విద్యా***
***విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః॥*** **1**

ఈ మంత్రంలోను తరువాతి మంత్రాల్లోను విద్యకు ఆ విద్యకు కూడా శాసకుడైన పరమేశ్వరుని స్వరూపాదులు వర్ణిస్తున్నారు.

నాశరహితుడు, అనంతుడు అయిన పరమాత్మ యందు విద్య, ఆవిద్య రెండూ కూడా ప్రచ్ఛన్న రూపంలో ఉంటాయి. పరమాత్మ ఈ రెంటికి అతీతడు. అ విద్య నశ్వరమైనది. విద్య(జ్ఞానం) శాశ్వతమైనది. ఈ రెంటిని శాసించేవాడు పరమాత్మ, అంటే జ్ఞానము, అజ్ఞానము కూడా మనసికాలే కాబట్టి ఈ రెంటికి పరమాత్మ అతీతుడే ! ఈ రెంటికి అతడే సాక్షి.

***మం॥ యో యోనిం యోని మధితిష్ఠత్యేకో***
***విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః।***
***ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే***
***జ్ఞానైర్బిభర్తి జాయమానంచ పశ్యేత్॥*** **2**

అనేక రూపాలతోను, పృథివ్యాది భూతాలతో కూడిని ఈ ప్రకృతి కంతటికి అతడే శాసకుడు. అన్ని ఉత్పత్తి స్థానాలకు అధిష్ఠాత- అంటే, అన్ని జీవారసుల పుట్టుకకు కారణభూతుడైనవాడు. సృష్టికి మొట్టమొదట తానే సృష్టించిన హిరణ్య గర్భునికి జ్ఞానాన్ని ప్రసాదించినవాడు. అంటే హిరణ్యగర్భునికి "జ్ఞానము అజ్ఞానము ఈ రెంటికి అతీతమైన తత్త్వమే- ఈ రెంటిని శాసించే తత్తమే పరమాత్మ" అనే జ్ఞానాన్ని కలిగించినవాడు.

***మం॥ ఏకైకం జాలం బహుధా వికుర్వన్నస్మిన్***
***క్షేత్రే సంహర త్యేష దేవః।***
***భూయః సృష్ట్వా పతయ స్తథేశః***
***సర్వాధిపత్యం కురుతే మహాత్మా॥ 3***

ఈ మాయతో గూడిన క్షేత్రంలో, సృష్టి సమయంలో పరమాత్మ ప్రతిగుంపును చిన్న చిన్న గుంపులుగాను, చిన్న గుంపులను వ్యక్తులుగాను మారుస్తు చివరకు మళ్ళీ ఆ మూల ప్రకృతిలోనికే ఉపసంహరిస్తూ ఉంటాడు- లయం చేస్తూ ఉంటాడు? మళ్ళీ సృష్టి సమయంలో సృష్టి నిర్వాహకులైన మరీచ్యాది ప్రజాపతులను సృష్టించి వారందరికి తాను యజమానియై కూర్చుంటాడు- అన్నిటిమీద, అందరిమీద అధిపత్యం చేస్తాడు. మాయా నిర్మితమైన ఈ శూన్యంలోనే సృష్టి, లయము, మరల సృష్టి ఎట్లా జరుగుతోందో చెప్పబడ్డది.

***మం॥ సర్వా దిశః ఊర్ధ్వ మధశ్చ తిర్యక్***
***ప్రకాశయన్ భ్రాజతే యద్వనడ్వాన్।***
***ఏవం స దేవో భగవాన్ వరేణ్యో***
***యోనిస్వభావా నధితిష్ఠ త్యేకః॥ 4***

పైనా, క్రిందా, అడ్డగాను, అన్ని దిక్కులందు సూర్యుడు ఏ విధంగా ప్రకాశింపచేస్తూ ఉంటాడో, అట్లాగే సమస్త సద్గుణాలకు అలవాలమైనట్టి, ఆరాధ్యుడైనట్టి పరమాత్మ చేతన రూపంతో ప్రకాశిస్తూ ఉంటాడు. ఈ విధమైన ప్రకాశ స్వరూపం స్వభావంగా కల ఆ పరమాత్మ తానే కారణస్వరూపమైన ప్రతిదానిని (పృథివ్యాదులను) నియంత్రిస్తూ ఉంటాడు. పృథివ్యాదులు నిజంగా కారణాలు కాకపోయినా వాటి ద్వారా పరమాత్మ పరమాత్మ యొక్క చర్యలు వ్యక్తమౌతుంటాయి. కాబట్టి వాటిని కారణాలంటారు.

***మం॥ యచ్చ స్వభావం పచతి విశ్వయోనిః***

***పాచ్యాంశ్చ సర్వాన్ పరిణామయేద్యః ।***

***సర్వమేత ద్విశ్వ మధితిష్ఠ త్యేకో***

***గుణాంశ్చ సర్వాన్ వినియోజనయేత్ యః ॥*** **5**

జగత్కారణమైన పరమాత్మయే ప్రతి వస్తువుకు తనదైన ఒక స్వభావాన్ని సృష్టిస్తారు. పెంపొందింప జేస్తాడు. అన్ని ప్రాణులకు వాటి వాటి యోగ్యతను బట్టి గుణాల్ని, పరిపూర్ణతను ఇస్తాడు– వంటకు ఉపయోగించే సంబారాలను వంటకంగా చేసినట్లు! ఈ సమస్త విశ్వాన్ని తానొక్కడే తన అధీనంలో ఉంచుకుంటాడు. సత్వ రజస్తమో గుణాలను ఆ యా జీవులకు తగినట్లుగా ఏర్పాటు చేస్తాడు– ఆ యా జీవుల కర్మలకు తగినట్లుగా అర్హతలను బట్టి ఆ యా కార్యాల్లో నియమిస్తాడు.

***మం॥ తద్వేద గుహ్యోపనిషత్సు గూఢం***

***తద్బ్రహ్మ వేదతే బ్రహ్మయోనిమ్ ।***

***యే పూర్వం దేవా ఋషయశ్చ తద్ విదు***

***స్తే తన్మయా అమృతా వై బభూవుః*** **6**

ఆ పరబ్రహ్మము వేదాలకు సారభూతమైనట్టి ఉపనిషత్తులలో నిగూఢమై ఉంది – అంటే, ఆ పరబ్రహ్మానికి సంబంధించిన రహస్యమంతా ఉపనిషత్తులలో ఉంది. హిరణ్యగర్భుడు కూడా తనకు, వేదాలకు ఆ పరబ్రహ్మమే ఉత్పత్తిస్తానం అని తెలుసు కున్నాడు. పూర్వపు ఋషులు దేవతలు కూడా అతనిని తెలుసుకున్నారు– ఆ పరబ్రహ్మంతోనే తాదాత్మ్యం చెందారు– అమరులైనారు. కాబట్టి, ఈనాడూ కూడా ఉపనిషత్తులలో దాగి ఉన్న ఆ పరబ్రహ్మన్ని సాక్షాత్కరించుకుంటేనే తప్ప మోక్షం లభింపదు.

ఇంతవరకు విద్యకు అవిద్యకు కూడా శాసకుడైన పరమేశ్వరుని స్వరూప స్వభావాలు వర్ణించారు.

***మం॥ గుణాన్వయో యః ఫలకర్మ కర్తా***

***కృతస్య తస్యైవ స చోపభోక్తా,***

*స విశ్వరూప స్త్రి గుణస్త్రివర్త్మా*
*ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః ॥* **7**

ఈ మంత్రం నుండి 10వ మంత్రంవరకు జీవుని స్వరూప స్వభావాదులు వర్ణిస్తారు.

జీవుడు గుణాలచేత బద్ధుడు, కర్మ చేస్తూ ఉంటాడు. ఆ చేసిన కర్మకు ఫలాన్ని అనుభవిస్తూ ఉంటాడు. నిజానికి, ఇంద్రియాలకు తాను అధిపతి అయినా అతడు గుణత్రయంచేత (ధర్మము, ఆధర్మము, జ్ఞానము లేక సత్త్వరజ స్తమోగుణాలు లేదా దేవయాన, పితృయాన మనుష్యయానాలు) బద్ధుడై ఉంటాడు. అనేక రూపాలు ధరిస్తూ తాను చేసిన కర్మ యొక్క ఫలాన్ని అనుసరించి (దేవ, పితృ, మనుష్య) మూడు మార్గాలలో తిరుగుతూ ఉంటాడు. మనుష్యయానాన్నే తిర్యఙ్మార్గమని కూడా అంటారు. అంటే దేవతగా, పితృదేవతగా లేదా మనుష్య లోకంలో ఏదో ఒక రూపంలో జన్మిస్తూ ఉంటాడు. ఈ విధంగా ప్రాణాలకు యజమాని అయిన జీవుడు తిరుగుతూ ఉంటాడు.

*మం॥ అంగుష్ఠ మాత్రో రవితుల్య రూపః*
*సంకల్పాహం కార సమన్వితోయః ।*
*బుద్ధేర్గుణే నాత్మగుణేన చైవ*
*ఆరాగ్రమాత్రో హ్యపరోఽపి దృష్టః ॥* **8**

బొటనవ్రేలి పరిమాణంలో సూక్ష్మంగా ఉండేవాడూ, సూర్యునిలాగా జ్యోతిస్వరూపుడు, పరిశుద్ధుడు, పరిమితమైన హృదయము బుద్ధి వీటి యొక్క గుణాలైన సంకల్పము ఆమంకారము మొదలైన గుణాలతో కూడినవాడు, శరీర గుణాలైన ముసలితనము, మృత్యువు తనకు ఉన్నాయని భావించేవాడు, ముల్లుకట్ట కొనలాగా సూక్ష్మంగా ఉండేవాడు జీవుడు. జీవాత్మ పరమాత్మలకు భేదం లేకపోయినా అహంకార సంకల్పాది మానసిక గుణాలవల్ల పరిమితుడై పరమాత్మ కానట్లుగా కనిపిస్తూ ఉంటాడు.

*మం॥బాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ।*
*భాగో జీవః న విజ్ఞేయః హిచానంత్యాయ కల్పతే ॥* **9**

ఈ మంత్రంలో జీవాత్మయొక్క పరిమాణాన్ని చెపుతున్నారు. ఒక వెంట్రుక యొక్క చివరిభాగాన్ని నూరుభాగాలు చేయగా వచ్చిన ఒక భాగాన్ని మళ్ళీ నూరుభాగాలుచేస్తూ ఈ

విధంగా వందసార్లు చేస్తే వచ్చే భాగం ఎంత సూక్ష్మంగా ఉంటుందో జీవాత్మ అంత సూక్ష్మమైనది. అంత సూక్ష్మమైనదైనా అది అనంతత్వాన్ని పొందగలదు. ఇదే తెలుసుకోవాల్సిన విషయం.

***మం॥ నైవ స్త్రీ న పూమానేష న చైవాయం నపుంసకః ।***
***యద్యచ్ఛరీర మాదత్తే తేన తేన రక్ష్యతే ॥*** **10**

ఆ జీవాత్మకు ఉపాధియేతప్ప అది పురుషుదు కాదు, స్త్రీ కదు, నపుంసకుడు కాదు. అది ఏ శరీరాన్ని ధరిస్తే ఆ శరీరంలోనే సురక్షితంగా ఉంటూ ఆ యా శరీరాల ధర్మాలను నిర్వరిస్తూ పనిచేస్తూ ఆ శరీరంతో తాదాత్మ్యం చెందుతుంది.

***మం॥ సంకల్పన స్పర్శన దృష్టిమోహై***
***ర్గ్రాసాంబు వృష్ట్యాత్మ వివృద్ధి జన్మ ।***
***కర్మానుగాన్యను క్రమేణ దేహీ***
***స్థానేషు రూపాణ్యభి సంప్రపద్యతే ॥*** **11**

ఈ మంత్రాలలో కర్మ ననుసరించి దేహ ప్రాప్తి కలుగుతుందని చెపుతున్నారు.

అన్న పానాదులవల్ల శరీరం వృద్ధి పొందుతోంది. అట్లాగే సంకల్పం, స్పర్శ, దర్శనం, మోహము వీటివల్ల శుభాశుభ కర్మలు జరుగుతున్నాయి. దేహంలో ఉండే జీవాత్మ క్రమంగా అనేక శరీరాల్లో ప్రవేశించి ఆ యా కర్మలకు తగినట్లుగా రూపాన్ని పొందుతుంది.

***మం॥ స్థూలాని సూక్ష్మాణి బహూనిచైవ***
***రూపాణి దేహీ స్వగుణైర్వృణోతి ।***
***క్రియాగుణై రాత్మగుణైశ్చ తేషాం***
***సంయోగ హేతు రపరోఽ పి దృష్టః ॥*** **12**

దేహాన్ని ధరించి ఉండే జీవాత్మ తన పాప, పుణ్య కర్మలద్వారా అనేక స్థూల సూక్ష్మ శరీరాల్ని పొందుతూ ఉంటుంది. మళ్ళీ ఆయా శరీరాలతో చేసిన కర్మలయొక్క ఫలాన్ని బట్టి, మానసిక సంస్కారాన్ని బట్టి మరియొక శరీరం పొందుతుంది. అంటే, పూర్వ జన్మలయొక్క ప్రస్తుత జన్మయొక్క కర్మలూ ఆ సంస్కారాలూ కూడా దేహాంతర ప్రాప్తికి కారణాలౌతున్నాయి.

*మం॥ అనాద్యవంతం కలిలస్య మధ్యే*

*విశ్వస్యస్రష్టార మనేక రూపమ్ ।*

*విశ్వస్త్యైకం పరివేష్టి తారం*

*జ్ఞాత్వా దేవం ముచ్ఛతే సర్వపాశైః ॥* **13**

అల్లకల్లోలంగా, గంభీరంగా ఉండే ఈ ప్రపంచం మధ్య ఉంటూ కూడా ఈ ఆత్మ అనాదియైనది, అనంతమైనది, విశ్వాన్ని సృష్టించిన వాడూ, అనేక రూపాలు ధరించేవాడూ, అంతటిని ఆవరించి ఉండే వాడూ అయిన పరమాత్మను తెలుసుకొని మానవుడు ఆవిద్య, కామము, కర్మ మొదలైన బంధనాలనుండి విముక్తుడౌతాడు.

*మం॥ భావగ్రాహ్య మనీడాఖ్యం భావా భావకరం శివమ్ ॥*

*కలాసర్గకరం దేవం యే విదు స్తే బహు స్తనుమ్ ॥* **14**

జీవం ఉన్నవాటిని, జీవం లేనివాటిని కూడా సృష్టించినవాడు, పరిశుద్ధమైన అంతః కరణ ద్వారా తెలుసుకో దగినవాడు, శరీరం లేనివాడు, అన్ని కళలకు, శాస్త్రాలకు ఆధారమైన వాడు (ప్రాణము మొదలైన కళలకు స్రష్టయైనవాడు) ప్రకాశ స్వరూపుడు అయిన పరమాత్మను ఆత్మభావంతో సాక్షాత్కరించుకొన్నవాడు, జన్మ మరణాది బంధనాలను వదలివేస్తాడు– అట్టివానికి మరియొక జన్మ ఉండదు.

# పునర్విమర్శనము

ఈ ఐదవ అధ్యాయంలో విద్యకు అవిద్యకు కూడా శాసకుడు పరమాత్మయే అని చెప్పి, అతని స్వరూపాదులు వర్ణింపబడ్డాయి. తరువాత త్వం పదార్థమైన జీవుని స్వరూపము, కర్మానుసారంగా దేహప్రాప్తి కలుగుతుందని, పరమాత్మ జ్ఞానంవల్ల మోక్షప్రాప్తి కలుగుతుందని వివరించారు.

# షష్ఠ్యాధ్యాయము

*మం॥ స్వభావమే కే కవయో వదంతి కాలం*
*తథాన్యే పరిముహ్యమానాః*
*దేవస్యైష మహిమా తు లోకే యేనేదం*
*భ్రామ్యతే బ్రహ్మచక్రమ్ ॥* **1**

ఈ మంత్రంలో ఈ సృష్టిచక్రానికి సంచాలకుడైన పరమాత్ముని మహిమను చెపుతున్నారు.

భ్రాంతికి లోనైన పండితులు కొందరు ఈ సృష్టి చక్రాన్ని త్రిప్పే శక్తి స్వభావము (ప్రకృతి) అని, మరికొందరు కాలము అని అంటారు. ఇట్లా అనటానికి కారణం ఏమిటంటే, సృష్టికి సహజ కారణాలుగా భావింపబడే వాటి వెనుక ఉన్నట్టి నిజమైన శక్తి పరమాత్మ అని తెలుసుకోలేక పోవటమే ! అదే భ్రాంతి. (ఈ సహజ కారణాలను గురించి మొదటి అధ్యాయం 2 మంత్రంలో వివరింపబడ్డది. ఈ బ్రహ్మచక్ర వర్ణనం మొదటి అధ్యాయం 4 మంత్రంలో చేయబడ్డది.) నిజానికి బ్రహ్మచక్రమంతా ఈ విధంగా తిరగటానికి కారణం పరమేశ్వరుని మహిమయే !

*మం॥ యేనావృతం నిత్యమిదం హి సర్వం*
*జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్ యః ।*
*తేనేశితం కర్మ వివర్తతే హ పృథి*
*వ్య ప్తేజోనిలఖాని చింత్యమ్ ॥* **2**

పరమాత్మచేత ఈ జగత్తు అంతా ఆవరింపబడి ఉందని, పరమాత్మ కాలాన్ని, కూడా తయారు చేసేవాడని (కాలానికి కూడా కర్త అని) అతడు పాపరహితుడని, సర్వజ్ఞుడని అతని

ఆజ్ఞవల్లనే పంచభూతాలు (పృథి, వ్యాప, స్తేజో, వాయు, రాకాశాలు) వివిధ రూపాలుగా కనిపిస్తున్నాయని తెలుసుకోవాలి.

అంటే ఈ జగత్కారణం పరమాత్మ అని గ్రహించాలి.

***మం॥ తత్కర్మ కృత్వా వినివర్త్య భూయ***
***స్తత్త్వస్య త త్త్వేన సమేత్య యోగమ్ ।***
***ఏ కేన ద్వాభ్యాం త్రిభి రష్టభి ర్వా***
***కాలేన చైవాత్మ గుణైశ్చ సూక్ష్మైః ॥*** **3**

సృష్టి కర్మను చేసి, దానిని పాలిస్తూ కూడా, భగవంతుడు ఈ సృష్టితో ఏమీ సంబంధం లేనివానివలె ఉంటాడు. చైతన్య తత్త్వాన్ని జడతత్త్వంతో కలుపుతాడు. అవిద్యతో (ఒకదానితో) ధర్మాధర్మాలతో లేక పుణ్యపాపాలతో (రెండింటితో) స్థూల సూక్ష్మకారణ శరీరాలతో (మూడింటితో) పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం (ఎనిమిదింటితో) కేవలం కాలాన్ని, తన సహజ గుణాలను నిమిత్తంగా (ఆధారంగా చేసుకొని కలుపుతూ ఉంటాడు. దానిని గురించే మనం చింతన చేయాలి.)

చైతన్య తత్త్వాన్ని జడంతో కలుపుతాడు. అంటే, లోగడ మనం సృష్టి కారణాలుగా చెప్పుకొన్న కాలం, ప్రకృతి, నియమము మొదలైన వాటిని నిమిత్తంగా చేసుకొని, జడంతో అంటే ఆవిద్య, ధర్మాధర్మాది ద్వంద్వాలతో, స్థూల సూక్ష్మ కారణ శరీరాలతో, ప్రకృతి యొక్క ఎనిమిది రూపాలతో కలుపుతాడు అని భావం, అంటే, సృష్టికి కారణం పరమాత్మయే అయినప్పటికి పైకి అట్లా కనిపించకుండా, కాలము మొదలైన సహజ గుణాలకు వెనుకనున్న శక్తిగా కనిపిస్తాడు. ఇంతటితో పరమేశ్వరుని మాహాత్మ్యాన్ని వర్ణించటం పూర్తిచేసి మోక్షనాకి సాధనాలను చెపుతున్నారు.

***మం॥ ఆరభ్య కర్మాణి గుణాన్వితాని***
***భావాంశ్చ సర్వాన్ వినియోజయేద్ యం।***
***తేషామభావే కృత కర్మ నాశః***
***కర్మక్షయే యాతి స తత్త్వతోఽ న్యః ॥*** **4**

ఈ మంత్రంలో పరమేశ్వరార్పణ బుద్ధితో చేసిన కర్మ పరంపరద్వారానే మోక్షప్రాప్తి కలుగుతుందని చెపుతున్నారు.

ఈ సృష్టిలో సత్త్వరజస్తమోగుణ సంబంధమైన పనులు చేస్తూ కూడా తనయొక్క విశిష్టమైన భావాలన్నింటిని పరమేశ్వరార్పణం చేయాలి. ఆ విధంగా పరమేశ్వరార్పణ బుద్ధితోచేసిన కర్మలను ఆత్మతో సంబంధం ఉండదు కాబట్టి జీవునియొక్క పూర్వసంచితమైన కర్మలన్నీ ఈ జ్ఞానం ద్వారా నశిస్తాయి. కర్మ వినాశమై పోతుంది కాబట్టి సాధకుడు వెనుకటి శ్లోకంలో చెప్పిన పృథివ్యాధి తత్త్వాలనుండి ముక్తుడై పరబ్రహ్మను చేరుతాడు- జనన మరణ చక్రం నుండి ముక్తుడౌతాడు.త

***మం॥ ఆదిః సః సంయోగ నిమిత్త హేతుః***
***పరస్త్రి కాలాదకలోఽ పి దృష్టః।***
***తం విశ్వరూపం భవభూత మీడ్యం***
***దేవ స్వచిత్తస్థ ముపాస్య పూర్వమ్ ॥*** **5**

ఈ మంత్రంలో చిత్తైకాగ్రతతో చేసే ఉపాసన ద్వారా భగవత్ప్రాప్తి కలుగుతుందని చెపుతున్నారు.

ఆ పరమాత్ముడే సమస్తానికి (సృష్టికి) కారణమైనవాడు, ఆఆాధ్యుడు, విశ్వమే రూపంగా కలవాడు. అతడే అద్యుడు (మొదటివాడు). దేహ సంయోగానికి చేతనాచేతనాల కలయికకు కారణ భూతుడు. త్రికాలములకు అతీతుడు. అంశలు లేనివాడు. అటువంటి ఆ పరమాత్మ తన హృదయంలోనే ఉన్నాడని ధ్యానించటం చేత ఆ పరమపురుషుని షాక్షాత్కరించుకోవచ్చు. ఈ విధమైన చిత్తైకాగ్రత మిక్కిలి అవసరం.

***మం॥ స వృక్ష కాలాకృతిభిః పరోఽ న్యో***
***యస్మాత్ ప్రపంచః పరివర్తతేఽ యమ్।***
***ధర్మావహం పాపమదం భగేశం***
***జ్ఞాత్వాఽ త్మస్థ మమృతం విశ్వధామ॥*** **6**

పరమాత్మ ఈ సంసార వృక్షంకంటె, కాలము రూపము వీటికంటె భిన్నమైనవాడు. ప్రపంచం కంటె కూడా భిన్నమైనవాడు ధర్మానికి అంతకు మూలస్థానమైనవాడు. పాపాల్ని నాశనం చేసేవాడు. సమస్త ఐశ్వర్యాలకు యజమాని అయినవాడు అనే విషయాన్ని

తెలుసుకున్న అధికారియైనవాడు. ఆ పరమపురుషుడు తన బుద్ధిలోనే ఆసీనుడై ఉన్నాడని తెలుసుకొన్నంతనే అమృత స్వరూపుడు, ఈ విశ్వానికి కారణభూతుడు ఐన పరమాత్మను పొందుతాడు, తన ఆత్మలోనే పరమాత్మను (అద్దంలో బింబాన్ని చూచినట్లు) దర్శించ వచ్చునని భావం. అయితే ఇందుకు కూడా జ్ఞానమే సాధనం.

***మం॥ తమీశ్వరాణాం పరమం మహేశ్వరం***
***తం దేవతానాం పరమం చ దైవతం।***
***పతిం పతీనాం పరమం పరస్తాత్***
***విదామ దేవం భువనేశమీడ్యమ్॥*** **7**

బ్రహ్మ, యముడు, వైవస్వతుడు మొదలైన ప్రభువులందరికి, ప్రభువైన వానిని, ఇంద్రుడు మొదలైన దేవతందరికి దైవమైనవానిని, ప్రజాపతులందరికి అతీతుడైన వానిని, అవ్యక్తమైన వాటికి కూడా అతీతమైన వానిని, ఈ భువనాలన్నింటికి యజమానియైన వానిని విశ్వస్తుత్యుని పరమాత్మను మేము సాక్షాత్కరించు కొందుము గాక !

***మం॥ న తస్య కార్యం కరణం చ విద్యతే***
***న తత్సమశ్చాభ్య ధికశ్చ దృశ్యతే।***
***పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే***
***స్వాభావికీ జ్ఞానబలక్రియా చ॥*** **8**

పరమాత్మకు తనకోసమంటూ సాధించాల్సిన పని అనేది లేదు. అట్లాగే సాధనములైన అవయవాలూలేవు- అశరీరుడు- నిరింద్రియుడు. అతనితో సమానులైనవారు గాని, అతనిని మించినవారు గాని ఎవరూ లేరు. అతని పరాశక్తియే అనేక విధాలుగా వేదాలలో వర్ణింపబడ్డది. అట్లాగే జ్ఞానము, బలము, క్రియాశక్తులన్నీ అతనికి స్వాభావికాలే అని వేదాలలో వర్ణింపబడ్డది.

***మం॥ న తస్య కశ్చిత్ పతిరస్తిలోకే***
***న చేశితా నైవ చ తస్య లింగమ్।***
***స కారణం కరణాధి పాధిపో***
***న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః॥*** **9**

లోకంలో అతనికి (పరమాత్మకు) యజమాని, నియంత అయిన వాడంటూ ఎవరూ లేరు. అతనిపై ఎవరికీ అధికారం లేదు. అతడు ఫలానా విధంగా ఉంటాడని గుర్తించటానికి ధూమాది రూపమైన చిహ్నమంటూ ఏదీ లేదు. అతడే అన్నింటికి కారణమైన వాడు. జీవాత్మలన్నింటికి పాలకుడైనవాడు అతడే ! అతనికి తండ్రి లేదు. అతనికి ప్రభువూ లేదు.

***మం॥ యస్తంతు (యస్నూర్ణ) వాభ ఇవ తంతుభిః***
***ప్రధాన జైః స్వభావతః।***
***దేవ ఏకః స్వమాన్వణోతి స***
***వో దధాతు బ్రహ్మాప్యయమ్ ॥*** **10**

సాలెపురుగు తాను తననుండి తీసుకునన దారాలోతనే తనను తానే (స్వాభావికంగా) కప్పు కొన్నట్లుగా (ఆవరించుకున్నట్లుగా) అద్వితీయుడైన ఆ పరమాత్మ ప్రకృతి జన్యాలైన కార్యాల ద్వారా స్వాభావికంగా తన్నుతానే ఆచ్ఛాదించుకుంటాడు. అటువంటి ఆ పరమ పురుషుడు మాకు తనలో ఏకాత్వాన్ని ప్రసాదించు గాక !

***మం॥ ఏకో దేవః సర్వభూ తేషు గూఢ ః***
***సర్వవ్యాపీ సర్వభూతాంత రాత్మా ।***
***కర్మా ధ్యక్షః సర్వభూతాధివాసః***
***సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥*** **11**

సమస్త ప్రాణులందు సర్వత్ర వ్యాపకుడై, అన్ని భూతాలలో– ప్రాణులలో అంతర్యామిగా దాగి ఉంటూన్న రమమాత్మయే సమస్త కర్మలకు అధిపతి– అన్ని కర్మలను పర్యవేక్షిస్తాడు. అన్ని జీవాలలోను ఆయన దాగి ఉన్నాడు. అంతేకాదు– అన్ని జీవాలు ఆయనలోనే ఉంటున్నాయి. అన్ని జీవాలు ఆయనలోనే ఉంటూన్నాయి. అన్నిటికి సాక్షియైనవాడు, ఉపాధి శూన్యుడు, సత్వ రజస్తమోగుణ రహితుడు అయిన శుద్ధ చైతన్యం ఆయనయే !

***మం॥ ఏకో వశీ నిష్క్రి యాణం బహూనా***
***మేకం బీజం బహుధా యః కరోతి ।***

*తమాత్మస్థం యేఽ ను పశ్యంతి ధీరా*

*స్తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్ ॥* **12**

అద్వయుదు, స్వతంత్రుడు, నిష్క్రియమైన జడాలు, జీవుల యొక్క బీజాన్నే (ఆద్య ప్రకృతినే) అనేకంగా చేసేవాడూ, తమ హృదయంలోనే ఉన్న ఆ పరమాత్మను శాస్త్రజ్ఞానం ద్వారా, గురువు ద్వారా తెలుసుకొని సాక్షాత్కారించుకొన గలిగిన ధీరులైన వారికే శాశ్వతమైన ఆనందం లభిస్తుంది.

*మం॥ నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా*

*మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।*

*తత్కారణం సాంఖ్యయోగాధి గమ్యం*

*జ్ఞాత్వా దేవం ముచ్య తే సర్వ పాశైః ॥* **13**

అతడు (పరమాత్మ) నిత్యులలో కెల్ల నిత్యుడు. అంటే మనం పంచభూతాలు శాశ్వతాలని అనుకుంటాము. కాని, అవి శాశ్వతాలు కావు. వాటికంటె శాశ్వతుడు పరమాత్మ, చేతనులలో కెల్ల చేతనుడు. అంటే, బుద్ధిమంతులైన వారందరికంటె బుద్ధిమంతుడు. అంటే, మనం తెలివి గలవి అని అనుకొనే హృదయం, బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు వీటి అన్నిటికంటె పరమాత్మయే తెలివిగలవాడని భావం. అతడు అద్వితీయుడు. తోడు ఎవరూ లేరు. అయినా దేవ మానవ పశు పక్ష్యాదుల కోరికలన్నీ తీర్చి అనుగ్రహిస్తాడు. వారి వారి కర్మలను బట్టి పుణ్య పాపాలను పంచి యిచ్చేది అతడే ! అన్నిటికి కారణమైనవాడూ అతడే! తత్త్వజ్ఞానం ద్వారా, యోగాభ్యాసం ద్వారా, తెలుసుకోదగిన వాడూ అయిన పరమాత్మను యోగాభ్యాసం ద్వారా, తెలుసుకోదగిన వాడూ అయిన పరమాత్మను తెలుసుకొని పురుషుడు అవిద్యాది బంధనాలన్నిటి నుండి విముక్తుడౌతాడు.

*మం॥ న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం*

*నేమా విద్యుతో భాంతి కుతోఽ యమగ్నిః ।*

*త మేన భాంతమనుభాతి సర్వం*

*తస్య భాసా సర్వమిదం విభాతి ॥* **14**

అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడు నక్షత్రాలు కూడా ప్రకాశించవు. మెరపు ప్రకాశించదు. ఇక అగ్ని విషయం చెప్పేదేముంది ! అంటే, అగ్ని కూడా వెలుగొంద దన్నమాటే ! ఆ పరమాత్మ ప్రకాశించి నందువల్లనే ఇవన్నీ ప్రకాశిస్తున్నాయి. సూర్యుని కాంతివల్ల చంద్రుడు భూమి మొదలైన గ్రహాలు ప్రకాశించినట్లే. ఆ పరమాత్మ ప్రకాశం వల్ల ఇవన్నీ ప్రకాశిస్తున్నాయి. అతని కాంతి వల్లనే ఈ గ్రహతారకలతో కూడిన ఈ విశ్వమంతా ప్రకాశిస్తోందని భావం.

ఇదే మంత్రం యథాతథంగా ముండకోపనిషత్తు 2- 2(10) మంత్రంలో ఉన్నది.

***మం॥ ఏకో హంసః భువనస్యా స్య మధ్యే***
***స ఏవాగ్నిః సలిలే సంనివిష్టః।***
***త మేవ విదిత్వా అతిమృత్యు మేతి***
***నాన్యః పంథా విద్య తేఽ యనాయ॥ 15***

ఈ విశ్వానికంతకు మధ్యలో, అవిద్యాది బంధనాలన్నింటిని ఛేదించ కలవాడు అతడొక్కడే ! (ఆ పరమాత్మయే) అతడు దేహంగా పరిణమించిన జలంలో ఉండే అగ్నివంటివాడు. నీటిలో నిప్పు వుండటం విరుద్ధంగానూ, అసంభవంగానూ కనిపించినట్లే ఈ దేహంలో లేదా విశ్వంలో పరమాత్మ అంతర్యామిగా ఉండటం కూడా విరుద్ధంగాను, అసంభవంగాను కనిపిస్తుంది. కాని, అది- పరమాత్మ విశ్వంలో అంతర్యామిగా ఉండటమనేది- కాదనలేని సత్యం. అటువంటి పరమాత్మను సాక్షాత్కరించు కొన్నందువలన మాత్రమే మానవుడు మృత్యువును తరిస్తాడు. ఇదే మార్గం- ఇంకొక మార్గం లేదు.

***మం॥ స విశ్వకృత్ విశ్వవిదాత్మ యోనిర్***
***జ్ఞః కాలకాలో(రో) గుణీ సర్వవిద్యః।***
***ప్రధాన క్షేత్రజ్ఞ పతిర్గుణేశః***
***సంసార మోక్షస్థితి బంధ మేతుః॥ 16***

అతడే ఈ విశ్వాన్ని సృష్టించినవాడు. సమస్తమైన విశ్వ రహస్యం తెలిసినవాడు అతడొక్కడే! అతడు తనకు తానే మూలమైన వాడు- అంటే స్వయం భువుడు, అతడే జ్ఞాత.

కాలాలకు అతడే ప్రేరకుడు– కాలాల్ని సృష్టించేవాడు అతడే ! (కాలకారః) కాలానికి అతడు యమునివంటివాడు లేదా యమునికి యమునివంటి వాడు (కాలకాలుడు) అంటే ప్రళయ సమయంలో సృష్టితోపాటు కాలాన్ని, యముణ్ణి కూడా లయం చేసేవాడు. సమస్త సద్గుణాలకు నిలయమైన వాడు. అన్నివిద్యలకు కేంద్రమైనవాడు. జడ చేతనాలను నియమించేవాడు. గుణాలకు ప్రభువు. సంసార చక్రంలో బంధించటానికీ, విముక్తి కలిగించటానికీ కూడా అతడే కారకుడు.

***మం॥ స తన్మయో హ్యమృత ఈశ సంస్థో***
***జ్ఞః పర్వగో భువనస్యాస్య గోప్తా !***
***య ఈశే౽ స్య జగతో నిత్యమేన***
***నాన్యో హేతు ర్విద్యతే ఈశనాయ ॥*** **17**

జ్యోతిర్మయుడు, విశ్వరూపుడు, అమరణ ధర్ముడు అయిన ఆ పరమాత్మయే విశ్వానికి ఆత్మ. ఈ విశ్వంపైన అధిపత్యంకూడా అతనిదే ! అతడు సర్వత్ర వ్యాపించి ఉన్నాడు. అతడు జగత్తును రక్షించేవాడు, జగత్తుకు నిత్య శాసకుడూను. అతనిని శాసించే వారెవరూ లేరు. ఈ జగత్తును శాసించేందుకు కూడా అతడు తప్ప సమర్థులెవ్వరూ లేరు.

***మం॥ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై***
***వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,***
***తంహ దేవం ఆత్మబుద్ధి ప్రకాశం***
***ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే ॥*** **18**

సృష్టికి ఆరంభంలో హిరణ్యగుర్భుని సృష్టించినవానిని, ఆ హిరణ్య గర్భునికి (విశ్వ చైతన్యానికి) వేదాలను అందించినవానిని, బుద్ధికి శాసకుడైన వానిని, అనగా ఎవని తేజస్సు, బుద్ధిని ఆత్మవైపుకు త్రిప్పుతుందో అట్టి ఆ పరమాత్మను మోక్షకాంక్షిని అయిన నేను శరణు వేడుతున్నాను.

***మం॥ నిష్కలం నిష్క్రియం శాంతం, నిరవద్యం, నిరంజనమ్,***
***అమృతస్య పరం సేతుం దగ్ధేంధన మివానలమ్ ॥*** **19**

ఆంశలు లేనివానిని, క్రియలు లేనివానిని, శాంతుని, అనిందితుని, నిష్కలమ్మషుని, మోక్షప్రాప్తికి శ్రేష్ఠమైన వారధి (సేతువు) వంటి వానిని, బాగా కాల్చబడిన (పొగ వగైరాలు లేకుండా) ఇంధనమందు (కట్టెయందు) ప్రదీప్తమయ్యే అగ్నివంటి వానిని మోక్షాన్ని కోరే నేను శరణు వేడుతున్నాను.

***మం ॥ యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః ।***
***తదా దేవ మనిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి ॥*** **20**

ఆ పరమాత్మను తెలుసుకోకుండా (జ్ఞానం ద్వారా) దుఃఖ నివృత్తి ఆవటం అసంభవం. మానవులు రూపంలేని ఆకాశాన్ని, చర్మాన్ని చుట్టచుట్టినట్లుగా చుట్టివేయ గలిగినప్పుడు మాత్రమే పైన చెప్పినట్లు, ఆ పరమాత్మను తెలుసుకోకుండా, దుఃఖనివృత్తి సాధ్యమౌతుంది. అంటే, ఆకాశాన్ని చర్మంలాగా (లేదా చాపలాగా అనుకోండి) చుట్టటం అసాధ్యం. అట్లాగే భగవత్సాక్షాత్కారం కలుగకుండా జీవునికి దుఃఖనివృత్తి అవటం కూడా అసంభవం అని భావం.

***మం॥ తపః ప్రభావాద్ దేవ ప్రసాదాచ్చ***
***బ్రహ్మ హ శ్వేతాశ్వతరోఽథ విద్వాన్ ।***
***అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం***
***ప్రోవాచ సమ్య గృషి సంఘ జుష్టమ్ ॥*** **21**

శ్వేతాశ్వతర మహర్షి తన తపః ప్రభావంతోను, పరమేశ్వరుని దయవల్లను బ్రహ్మను సాక్షాత్కరించుకొన్నాడు. దృఢమైన అపరోక్షానుభవం కలిగిన పిమ్మట ఋషీశ్వరులందరు ఆశ్రయించే ఆ పరమపవిత్రమైన బ్రహ్మతత్త్వాన్ని సర్వోత్కృష్టులైన సన్న్యాసులకు ఉపదేశించాడు.

బ్రహ్మజ్ఞనం పొందాలంటే తపోబలంతోబాటు ఈశ్వరుని కృప కూడా ఉండాలి. ఈ రెండు సాధనాలద్వారా ఆత్మ సాక్షాత్కారం పొంది, పిమ్మట యోగ్యులైనట్టి అధికారులైనట్టి శిష్యులకు తప్పకుండా బోధించాలి. అట్లా ఈ బ్రహ్మవిద్యను బోధించకపోతే ఈ బ్రహ్మవిద్యా సంప్రదాయానికి లోపం వస్తుంది. ఆత్మ సాక్షాత్కారానికి ఈశ్వరకృప కూడా అవసరం కాబట్టి ఈ ఉపనిషత్తులో ఈశ్వర ప్రార్థన మంత్రాలుకూడా చోటు చేసుకున్నాయి.

*మం॥ వేదాంతే పరమం గుహ్యం*

*పురాకల్పే ప్రచోదితమ్ ।*

*నా౽ ప్రశాంతాయ దాతవ్యం నా*

*పుత్రాయా శిష్యాయవా పునః ॥* **22**

ఉపనిషత్తులలోగూఢంగా ఉన్న ఈ బ్రహ్మవిద్యను అధికారియైన వానికి ఉపదేశించాలి. అధికారి ఎవరు? ఎవని మనస్సు రాగద్వేషాది మాలిన్యాలు లేకుండా స్వచ్ఛంగా ఉంటుందో అటువంటి శిష్యునికిగాని, పుత్రునికి గాని ఈ పరమ రహస్యమైన బ్రహ్మవిద్యను బోధించాలి. పై అర్హత లేకపోతే శిష్యుడైనా, కొడుకైనా బ్రహ్మవిద్యోపదేశానికి అనర్హుడే ! తగిన పుత్రుడు, శిష్యుడు కానివానికి బోధించరాదని అనటంలో విద్యా సంప్రదాయ రక్షణ కోసం ఈ విధిని చెప్పారని స్పష్టమౌతోంది.

*మం॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథాగురౌ ।*

*తస్యైతే కథాతాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ।*

*ప్రకాశంతే మహాత్మనః ॥* **23**

భగవంతునియందు, భగవంతునివలెనే గురువునందు శ్రద్ధాభక్తులు కలిగిన మహాత్మునికి పైన చెప్పిన ఉపనిషత్తులలోని సత్యాలన్నీ ప్రకాశితమౌతాయి. "ప్రకాశంతే మహాత్మనః" అనే ద్విరుక్తి ఉపనిషత్సమాప్తిని అటువంటి యోగ్యతగల, సాధన సంపత్తిగల శిష్యులు, కొడుకులు చాలా అరుదుగా ఉంటారని సూచిస్తుంది.

# ఉత్తర శాంతి పాఠము

ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై ।

తేజస్వినావధీతమస్తు మావిద్విసావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

# కైవల్యోపనిషత్తు

## శాంతిపాఠము

*హరి : ఓం, సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై ।*

*తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥*

(ఓం శాంతిః శాంతిః శాంతిః ॥)

(అర్థం శ్వేతాశ్వతరోపనిషత్తు ఆరంభంలో ఇచ్చాము)

**మం॥ ఓం అథాశ్వలాయనో భగవన్తం పరమేష్టిన ముప**
**సమేత్యోవాచ । అధీహి భగవన్బ్రహ్మవిద్యాం వరిష్ఠాం**
**సదా పద్భిః సేవ్యమానం నిగూఢాం। యథా చిరా**
**త్సర్వ పాపం వ్యపోహ్య పరాత్పరం పురుషం యాతి విద్వాన్॥ 1**

పరమేష్ఠియైన ప్రజాపతి (బ్రహ్మ) వద్దకు వచ్చి ఆశ్వలాయన మహర్షి యీ విధంగా ఆడిగాడు– 'ఓ భగవానుడా ! విద్యలన్నింటిలోకి శ్రేష్ఠమైనది, సత్పురుషు లందరిచేత ఉపాసింపబడేది, మిక్కిలి రహస్యమైనది అయిన బ్రహ్మవిద్యను నాకు ఉపదేశించండి. బ్రహ్మవేత్తలైన వారి వలె పాపాలన్నింటిని పోగొట్టుకొని, శీఘ్రంగా వరాత్పరుని పొందేటట్లుగా నాకుకూడా బ్రహ్మవిద్యను ఉపదేశించండి" అని.

**మం॥తస్మై స హోవాచ పితామహశ్చ**
**శ్రద్ధా భక్తి ధ్యాన యోగాధవైహి ॥ 2**

ఆ విధంగా అడిగిన ఆశ్వలాయనునితో బ్రహ్మప్రజాపతి ఈ విధంగా అన్నాడు – శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగంద్వారా పరమాత్మ తత్త్వం తెలుసుకో! " అని.

**మం॥ న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనై కే అమృ**
**తత్వ మానశుః । పరేణ నాకం నిహితం గుహాయాం**
**విభ్రాజతే యద్యతయో విశన్తి ॥ 3**

ఆశ్వలాయనునితో బ్రహ్మప్రజాపతి ఇంకా ఈ విధంగా అన్నారు. "కర్మద్వారాగాని, ప్రజ (సంతానం) ద్వారా గాని, ధనం ద్వారా గాని, ఎవరూ, ఎన్నడూ అమరత్వాన్ని పొందలేరు. అమరత్వ రూపమైన మోక్షాన్ని త్యాగం ద్వారా మాత్రమే పొందగలిగారు. త్యాగమంటే దాన ధర్మాలు చేయటమే కాదు– రాగద్వేషాదుల త్యాగం, కామ్యకర్మల త్యాగం మొదలైనవిగా కూడా గ్రహించాలి. స్వర్గంకంటె కూడా శ్రేష్ఠమైన దైన ఈ హృదయమనే గుహలో ప్రకాశిస్తూ ఉండే పరతత్త్వంలో శమ దమాది సాధన సంపన్నులైన, ప్రయత్నశీలురైన (తపస్వులైన) మహర్షులు ప్రవేశించగలుగుతారు. అంటే అటువంటి శమదమాది నియమశీలురైన వారే హృదయంలో ఉన్న పరమాత్మలో లీనం కాగలుగుతారు.

***మం ॥వేదాంత విజ్ఞాన సునిశ్చి తార్థాః***
***సన్న్యాపయోగా ద్యతయః శుద్ధ సత్త్వాః।***
***తే బ్రహ్మలోకేషు పరా న్తకాలే***
***పరా మృతాః పరిముచ్యన్తి సర్వే ॥*** **4**

వేదాంతాన్ని వింటూ ఉండటంవల్ల సుదృఢమైన ఆపరోక్ష జ్ఞానం కలుగుతుంది. అటువంటి జ్ఞానం వల్ల పరతత్త్వాన్ని గూర్చిన పూర్తి నిశ్చయం కలుగుతుంది. ఈ విధంగా ఎవరి అంతఃకరణం విశుద్ధమై ఉంటుందో అటువంటి పరోక్ష జ్ఞానులు యత్నశీలురు అయిన పురుషులు సన్యాసయోగం ద్వారా బ్రహ్మలోకాన్ని పొంది, లయకాలంలో బ్రహ్మతోబాటు ఉత్కృష్టమైన అమరత్వాన్ని పొందుతారు. అంటే జన్మ మరణాది బంధనాలనుండి ముక్తుడౌతాడు– క్రమముక్తిని పొందుతాడు.

వేదాంతాన్ని వినటం. పరబ్రహ్మను గూర్చిన నిశ్చయజ్ఞానం కలగటం, తపస్సు ఆ పైన సన్న్యాసదీక్ష ఇవన్నీ ఒక క్రమాన్ని తెలుపుతున్నాయి.

***మం॥ వివి క్త దే శే చే సుఖానవస్థః***
***శుచిః సమగ్రీవ శిరః శరీరః।***
***అన్త్యాశ్రమస్థః సక లేంద్రియాణి***
***నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య ॥*** **5**

కాబట్టి, నాల్గవదైన సన్న్యాస ఆశ్రమంలో ఉన్నవాడు పవిత్రుడై నిర్జన ప్రదేశంలో సుఖాశీనుడై మెడ, తల, శరీరాన్ని తిన్నగా నిలుపు కొని, తనకు బ్రహ్మవిద్యను ఉపదేశించిన గురువుకు భక్తితో నమస్కరించి, బాహ్యేంద్రియా లన్నింటిని అడ్డగించి (నిరోధించి) యోగంలో స్థిరంగా ఉండాలి.

ఈ మంత్రం భగవద్గీతలోని ఆత్మసంయమయోగం లోని 11 నుండి 14 శ్లోకాల భావాన్ని తలపింప చేస్తోంది.

***మం॥ హృత్పుండరీకం విరజం విశుద్ధం***
***విచిన్త్య మధ్యే విశదం విశోకం ।***
***అచిన్త్య మవ్యక్త మన న్త రూపం***
***శివంత ప్రశాంత మమృతం బ్రహ్మయోనిమ్ ॥ 6***

పిమ్మట శరీర మధ్యంలో హృదయ కమలంలో ఉన్నట్టి, విశుద్ధుడైనట్టి, బుద్ధికి కూడా గోచరుడు కానట్టి ఇంద్రియాలకు అతీతుడైనట్టి, దేశకాల వస్తుగతమైన వాటి అన్నింటికి ఆతీతుడు, ఆవ్యక్తుడు, శాంతుడు, అవినాశి, వేదప్రమాణైక గమ్యుడు, విశుద్ధుడు, కల్యాణ స్వరూపుడు అయిన పరమాత్మను ధ్యానంచేసి (అధికారియైనవాడు) సంసార బంధాల నుండి విముక్తుడౌతాడు.

***మం॥తమాది మధ్యాన్త విహీన మేకం***
***విభుం చిదానన్ద మరూప మద్భుతమ్ ।***
***ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం***
***త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ।***
***ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం***
***సమస్త సాక్షిం తమసః పరస్తాత్ ॥ 7***

ఆది, మధ్య, అంత రహితుడు, అద్వితీయుడు, ప్రభువు, నిరాకారుడు, సర్వవ్యాపకుడు, సచ్చిదానంద స్వరూపుడు, ఉమాపతి, త్రిలోచనుడు, నీలకంఠుడు, ప్రశాంతుడు అయిన వానిని, అన్నిటికి సాక్షియైన వానిని అజ్ఞానాంధకారానికి అవల ఉన్నవానిని, అందరి

అంతః కరణలకు సాక్షిభూతుడైన వానిని ఈ సృష్టికి కారణబూతుడైన వానని ధ్యానించి మునీశ్వరులు అతనినే పొందుతారు.

ఈ మంత్రంలోని త్రిలోచనాది శబ్దాలను సగుణుడైన ఈశ్వరుని ఉద్దేశించినవిగా తలంచక నిర్గుణ పరమాత్మగా భావిస్తే జ్ఞానైకగమ్యుడైన పరమాత్మను పొందుతారని చెప్పుకోవచ్చు. (దీనిని శైవోపనిషత్తుగా పేర్కొనటానికి ఈ విశేషణాలే కారణం కావచ్చు!) రాబోయే మంత్రం ఈ భ్రమను పరిహరిస్తుంది.

***మం॥ స బ్రహ్మ స శివః సేంద్రః సో క్షరః పరమః స్వరాట్।***

***స ఏవివిష్ణుః స ప్రాణ ః సకాలలోఽ గ్నిః స చంద్రమాః ॥*** **8**

అతడే (ఆ పరమాత్మయే) బ్రహ్మ, శివుడు, ఇంద్రునితో సహా సమస్త దేవతా స్వరూపుడు, శాశ్వతుడు (నాశరహితుడు) సర్వోత్కృష్టుడు, స్వయం జ్యోతి. అతడే విష్ణువు, హిరణ్యగర్భ స్వరూపమైన జగత్ప్రాణము, కాలము, అగ్ని, చంద్రుడు అన్నీ అతడే ! ఈ పేర్లన్నీ ఆ పరబ్రహ్మను ఉద్దేశించినవే ఆవటంవల్ల సగుణత్వాన్ని పరిహరించటం జరిగింది. ఈ అన్నింటిలోనూ అనుస్యూతంగా ఉన్న పరతత్త్వమే ప్రధానం.

***మం॥ స ఏ వ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం।***

***జ్ఞాత్వాతంమృత్యు మత్యేతి నాన్యః పన్థా విముక్తయే ॥*** **9**

గడచిపోయిన కాలంలో ఉండినవాడూ, జరగబోయే కాలంలో ఉండేవాడూ, వర్తమానంలో ఉన్నవాడు సమస్తము అతడే ! అటువంటి ఆన సనాతన తత్వాన్ని ఆపరోక్ష రూపంలో అనుభవంలోకి తెచ్చుకొన్న సాధకుడు మృత్యువును తరిస్తాడు. ఈ విధంగా అపరోక్షానుభూతి– బ్రహ్మ ఆత్మ ఒకటే అనే అనుభవం తప్ప మోక్షానికి వేరే మార్గం లేదు.

***మం॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని***

***సం పశ్యన్బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా ॥*** **10**

అన్నిటిని సమభావంతో చూచే యోగి, సమస్త భూతాలలోను ఉన్నట్టి ఆత్మను, ఆత్మలో ఉన్నటి సమస్త భూతాలను చక్కగా చూస్తూ పరబ్రహ్మను సాక్షాత్కరించుకో గలుగుతాడు. ఇంతకంటె వేరే మార్గం లేదు– సాధనమూ లేదు.

*'సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।*

*ఈక్షతే యోగయుక్తాత్మ సర్వత్ర సమదర్శిన ః ॥"*

*మం ॥ ఆత్మనా మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం ।*

*జ్ఞాన నిర్మథనాభ్యాసాత్ పాపం దహతి పండిత ః ॥* **11**

ఆత్మను క్రింద ఉండే అరణిగాను, ప్రణవాన్ని (ఓంకారాన్ని) పైన ఉండే అరణిగాను చేసుకొని, వివేకంతో నిరంతర ధ్యానరూపమైనట్టి అభ్యాసం వల్ల కలిగిన తత్త్వజ్ఞానం ద్వారా పండితుడైనవాడు సమస్త పాపాల్ని దహించి వేస్తాడు.

రాపిడి ద్వారా అగ్నిని రగుల్కొల్పేందుకు ఉపయోగించే కట్టను అరణి అంటారు. ఆత్మ– ఓంకారం, ఈ రెంటి రాపిడివల్ల (అంటే నిరంతర ధ్యానం వల్ల) జ్ఞానమనే అగ్ని పుడుతుంది. ఆ విధంగా పుట్టిన జ్ఞానాగ్ని సమస్త పాపాలను దహించటానికి సమర్థమౌతుంది.

*మం॥ స ఏవ మాయా పరిమోహితాత్మా*

*శరీరమాస్థాయ కరోతిసర్వమ్ ।*

*స్త్రియన్న పానాది విచిత్రభోగై ః*

*స ఏవ జాగ్రత్పరితృప్తిమేతి ॥* **12**

మాయచేత – అజ్ఞానంచేత మోహం పొందిన అంతఃకరణం కలవాడు, దేహాన్నే ఆత్మగా భ్రమించి సమస్త శుభాశుభ కర్మలు చేస్తూ వుంటాడు. స్త్రీ అన్నపానాదుల వంటి విచిత్రమైన భోగాలతో అజ్ఞానియైన జీవుడు జాగ్రదవస్థలో చక్కగా తృప్తిపొందుతూ వుంటాడు.

*మం॥స్వప్నే స జీవః సుఖదుఃఖభోక్తా*

*స్వమాయయా కల్పితజీవలోకే ।*

*సుషుప్తికాలే సక లే విలీనే*

*తమోఽ భిభూతః సుఖరూపమేతి ॥* **13**

మాయ ద్వారా కల్పింబడిన జీవుని యొక్క సంసారమనే స్వప్నావస్తలో ఆజీవుడు సుఖ దుఃఖాలకు భోక్తగా ఉంటా దు–సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడు. ఆజ్ఞానమనే

చీకటి చేత కప్పబడిన ఆ జీవుడే సుషుప్తి కాలంలో (గాఢనిద్రలో) సమస్త స్థూల సూక్ష్మ ప్రపంచాలకు కారణమైనదానిలో – ఆత్మలో– లీనమై అవిద్యచేత ఆచ్ఛాదింపబడిన స్వరూప సుఖాన్ని అనుభవిస్తాడు. సుషుప్తిలో కలిగే సుఖం కూడా ఆవిద్యా భిభూతమైనదే ! అని భావం.

*మం॥ పునశ్చ జన్మాంతర కర్మయోగాత్*
*స ఏవ జీవః స్వపితి ప్రబుద్ధః।*
*పురత్రయే క్రీడతి యశ్చ జీవ*
*స్తతస్తు జాతం సకలం విచిత్రం।*
*ఆధార మానంద మఖండ బోధం*
*యస్మింల్లయం యాతి పురత్రయంచ॥* **14**

సుషుప్తి కాలంలో నిద్రపోతున్న జీవుడే జాన్మంతర కర్మ సంబంధం వల్ల – తాను చేసుకొన్న కర్మపలాన్ని అనుభవించటా నికై మళ్ళీ మేల్కొంటున్నాడు. ఈ విధంగా జీవుడు జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలలోను (పురాల్లోను) క్రీడిస్తూ ఉంటాడు. అతని వల్లనే ఈ విచిత్రమైన జగత్తు సృష్టింపబడుతోంది. ఎవనిలో స్థూల సూక్ష్మ కారణ శరీరాలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు, వీటికి అభిమానియైన జీవుడు లయమైపోతారు అటువంటి ఆ పరమాత్మయే ఈ విశ్వానికంతకు మూలకారణమైనవాడు. అతడే ఆఖండ జ్ఞాన స్వరూపుడు.

*మం॥ ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ।*
*ఖం వాయుర్జ్యోతిరాపశ్చ పృథివీ విశ్వస్య ధారిణీ॥* **15**

*యత్పరం బ్రహ్మపర్వాత్మా విశ్వస్యాయతనం మహత్।*
*సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం స తత్త్వమేవ త్వమేవ తత్॥* **16**

పై చెప్పిన ఆ పరమాత్మ వల్లనే ఈ సమిష్టి ప్రాణము, వ్యష్టి ప్రాణము కూడా పుడుతున్నాయి. అంతేకాదు, మనస్సు, ఇంద్రియాలు, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, ఈ విశ్వాన్ని ధరించే పృథివి, అన్నీ పుడుతున్నాయి.

ఏ పరబ్రహ్మ అందరికి ఆత్మ స్వరూపుడై ఉన్నాడో, ఏ పరమాత్మ, ఏ మహత్తత్వం ఈ సృష్టికంతకు ఆధారమై ఉన్నాడో ఏ మహత్తత్వ సూక్ష్మాతి సూక్ష్మమై, నిత్యమై ఉన్నదో ఆ మహత్తత్వానివి నీవే! నీవే ఆ మహత్తత్వం !

***మం॥ జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।***
***తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥ 17***

***త్రిషుధామసు యద్భోగ్యం భోక్తాభోగశ్చ యద్భవేత్ ।***
***తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః॥ 18***
***మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం ।***
***మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహం॥19***

జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలను ప్రకాశింపచేస్తూ ఈ మూడు అవస్థలకు సాక్షిభూతుడ ఉండే పరబ్రహ్మను నేనే ! అని తెలుసుకొన్నవాడు సమస్త బంధనముల నుండి విముక్తుడౌతాడు.

జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు ఆవస్థలలో భోగ్యము, భోక్తతానే అయి వాటికి విలక్షణమైన సాక్షిగా ఉండే చిన్మాత్ర స్వరూపుడనైన శివుడను నేనే ! అని తెలుసుకున్నవాడు ముక్తుడౌతాడు.

సచ్చిదానంద స్వరూపుడను, పరమాత్మను అయిన నానుండే ఈ ప్రపంచాలన్నీ పుట్టాయి. నాలోనే అన్నీ ఉంటున్నాయి. నాలోనే ఇవన్నీ లయమౌతాయి. అటువంటి అద్వితీయుడైన పరబ్రహ్మను నేనే !

# ద్వితీయాధ్యాయము

***మం॥ అనోరణీయానహమేవ తద్వస్మహోనహం***
***విశ్వమహం విచిత్రం।***
***పురాతనో హం పుషుషో హమీశో***
***హిరణ్యయోఽ హం శివరూపమస్మి॥ 1***

సూక్ష్మాతి సూక్ష్మమైనవాడను నేనే ! మహత్తరమైన దానికంటే మహత్తరమైనవాడను నేనే ! నేనే పురాతనుడను. ఈ విశ్వానికంతకు శాసకుడను నేనే ! నేనే హిరణ్యాము స్వరూపుడను. నేనే కల్యాణ స్వరూపుమైన శివతత్త్వాన్ని.

***మం॥అపాణి పాదోఽ హ మచింత్యశక్తిః***
***పశ్యామ్యచక్షుః స శృణోమ్యకర్ణః।***
***అహం విజానామి వివిక్తరూపో వ చాస్తి***
***వేత్తా మమ చిత్సదాహమ్॥ 2***

చేతులు, పాదాలు మొదలైన ఆవయవాలు లేనివాడిని, ఊహకు కూడా అందని శక్తిస్వరూపుడను నేను. కండ్లు లేకపోయినా చూడగలను. చెవులు లేకపోయినా వినగలను. నేను ఆద్వితీయుణ్ణి– నాకు సాటి అయినవారులేరు. నేను అసంగుడనైనప్పటికి అందరిని ఎరుగుదును. కాని సచ్చిదానంద స్వరూపుడనైన నన్ను గుర్తించగలవారు లేరు.

**మం. వేదైరనేకై రహమేవ వేద్యో**
***వేదాంతకృద్వేద విదేవ చాహమ్।***
***న పుణ్యపాపే మమ నాస్తి నాశో***
***న జన్మ దేహేంద్రియ బుద్ధి రస్తి॥ 3***

వేదాలన్నింటివల్ల తెలుసుకోదగినవాడను నేనే ! వేదాంతానికి కర్తను, వేదాలకు వేత్తను (తెలిసినవాడిని) నేనే ! నాలో పుణ్యపాపాలు లేవు. నాకు జన్మలేదు; మరణమూ లేదు. నాకు దేహేంద్రియ బుద్ధులు లేవు.

*మం॥ న భూమిరాపో వ చ తహ్నిర స్తి*

*న చానిలో మే౽ స్తిన చాంబర చ ।*

*ఏవం విదిత్వా పరమాత్మ రూపం*

*గుహాశయం నిష్కల మద్వితీయం ॥* **4**

నాలో భూమి లేదు. జలం లేదు. అగ్ని లేదు. వాయువు లేదు. ఆకాశమూ లేదు– పంచభూతాలు నాచేత నిర్మింపబడ్డాయి. అంతేగాని, నేను పంచభూతాలచే నిర్మింపబడలేదు. నేను అంశలు లేనివాడిని. అద్వితీయుడనై బుద్ధి అనే గుహలో ఉంటున్న పరమాత్మ తత్త్వాన్ని అయిన నన్ను తెలుసుకొని మాత్రమే జీవులు సంపూర్ణంగా బంధవిముక్తులౌతారు.

*మం॥ సమస్తసాక్షిం సదసద్విహీనం*

*ప్రయాతిశుద్ధం పరమాత్మరూపం ।*

*యః శతరుద్రీయ మధీతే పో గ్నిపూతో భవతి ।*

*స వాయు పూతో భవతి స ఆత్మపూతో భవతి ।*

*స సురాపానాత్పూతో భవతి*

*స బ్రహ్మహత్యాత్పూతో భవతి ।*

*స సువర్ణ స్తేయాత్పూతో భవతి*

*స కృత్యాకృత్యాత్పూతో భవతి ।*

*తస్మాదవిముక్త మాశ్రితో భవతి*

*అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్ ॥*

*అనేవ జ్ఞానమాప్నోతి సంసారార్ణవ నాశనమ్ ।*

*తస్మాదేవం విదిత్వైనం కైవల్యం ఫలమశ్నుతే ।*

*కైవల్యం ఫలమశ్నుతే ॥* **5**

ఈ ప్రపంచంతో సంబంధం లేనట్టి, ఈ ప్రపంచానికి (విశ్వానికి) బయటా లోపలా కూడా సాక్షియైనట్టి పరమాత్మ స్వరూపమైనట్టి, వేదాలన్నింటిలోను ప్రతిపాదింపబడినట్టి తత్త్వాన్ని తెలుసుకొన్నవాడు అగ్ని లాగా పరిశుద్ధుడౌతాడు. ఆత్మ లాగా పవిత్రుడౌతాడు.

సురాపానం. బ్రహ్మహత్య, సువర్ణాపహరణం వల్ల కలిగిన పాపాలనుండి కూడా విముక్తుడౌతాడు. ఆ శ్రమ ధర్మాలను అతిక్రమించిన పాపం కూడా ఈ ఆత్మజ్ఞానం పొందటంవల్ల నశిస్తుంది. ఈ విధంగా ఆత్మ స్వరూపుడైన పరమ్మాతో అపరోక్షానుభూతిని పొంది అధికారియైనవాడు మోక్షాన్ని పొందుతాడు- మోక్షాన్ని పొందుతాడు- మోక్షాన్ని పొందుతాడు.

**ఉత్తర శాంతిపాఠము**

సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః